# శ్రావణవిజయము.

ఇది

కాకినాడ వాస్తవ్యులు,

సాహిత్యవిశారద,

## కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారిచే

విరచింపఁబడి, ప్రకటింపఁబడినది

ప్రథమముద్రణము 1000 ప్రతులు.

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది

1937



[వెల రు 0-8-0.



విజయాంకితులు,

శ్రీ రాజా శ్రీరామకృష్ణయ్య జమీందారుగారు.

# అంకితము.



శ్లో. "కృతిః కీర్తికరీ నౄణాం సప్తసంతాన వస్తుషు
నితా చ సర్వగాచేయం నేతరాణి తథాభువి."

తూర్పుగోదావరీమండలమునకు మండనాయమానమై వెలయుచున్న కాకినాడపురమునఁ గల సుప్రసిద్ధ వైశ్యవంశము లలో శ్రీపైఁడావారి కుటుంబము ధర్మకార్య నిర్వహణమున విశేషకీర్తివంతమై తేజరిల్లుచున్నది.

అట్టి సత్కులమున బహుజనపోషకులై కీర్తిశేషులైన శేషమాంబాచలమయ్య నామధేయులగు పుణ్యదంపతులకు శ్రీ శ్రీరామకృష్ణయ్య జమీందారుగారు జ్యేష్ఠపుత్త్రులు. వీ రాగర్భ శ్రీమంతులయ్యు, నిగర్వచూడామణులు; నవయవ్వను లయ్యు నిష్కలంకచరితులు; నిధిపరిపాలనకుశలురయ్యు వదాన్య శేఖరులు; నానావిద్యావిజ్ఞానులయ్యు స్వమతనిరతులు; బహు కార్యధూర్వహులయ్యు భగవదారాధన జాగరూకులు.

ఇట్టి సుగుణభూషితులగు శ్రీరామకృష్ణయ్య జమీం దారుగారికి ఈ వైశ్యవటువీర పూతజీవితశోభితమగు "శ్రావణ విజయము" నాచే నంకితమొనర్పఁ బడినది.

సాహిత్యవిశారద,
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.

# అవతారిక.



ఉభయభాషాకోవిదులును, సాహిత్యవిశారద బిరుదాంకితులునగు బ్రహ్మశ్రీ కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారిచే రచింపఁబడిన శ్రావణవిజయమును సాకల్యముగఁ బఠించి యమితానందము నందితిని.

ఈగ్రంథమున నేభాగము చదివినను గ్రంథమును సాంతముగా ముగింపవలయునను నుత్సాహము జనించి తీరును. ఇందలి సహజ సుందరములగు కథాసంవిధానములును, హృదయాకర్షకములగు భావప్రకటనములును, శ్రీకరములగు శీలవివరణములును, లలితసుందరములగు పదవిన్యాసములును, పాఠకమహాశయులఁ బరవశులనుగాఁ జేయఁగలవనుట అతిశయోక్తికాదు.

ఈకాలమున యువతీయువక మానసముల సదాశయతోయ తరంగితములనుగాఁ జేయుట కిట్టి కావ్యఘనోదయము లత్యవసరములు. శ్రీ శాస్త్రిగారు దేశకాలగతుల గమనించి, నీతిబోధకములగు కృతిరాజముల విరచింపఁబూనుట దేశమున కెంతయు శుభావహము.

పాఠశాలల యందుఁ బఠనీయములుగా నుండఁదగిన గ్రంథము లిట్టివియేయని నాభావము.

పరవస్తు వేంకటరామానుజస్వామి, యమ్. యే.
ప్రిన్సిపల్, మహారాజాస్ సంస్కృతకాలేజీ, విజయనగరం.



విజయరచయితలు, సాహిత్యవిశారద,

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

ఁబడిన మేడ గూలఁబడును. కావుననే "సనాతన పూతజాతీయ మర్యాద యువజన శీలములపై నాధారపడి యున్నది." అని భారత భాస్కరుఁడగు వివేకానంద దేశికేంద్రుఁడు ప్రబోధించి యున్నారు.

దీనివలన యువజన శీలసంపద చెడకుండఁ జూచుచుండ వలయునని, విశదమగుచున్నది. అందుచే శీలసంరక్షణదక్షములగు పురాణకథలఁ దీసికొని, విజయము లనుపేరిటఁగొన్ని కావ్యములు విరచించితిని.

అం దీ శ్రావణవిజయ మొకటి. ఇందలి నాయకుఁడగు శ్రావణకుమారుఁడు సకలకలా విశారదుఁడు, పితృసేవా పరాయణుఁడు, దయాలవాలుఁడు, ధర్మలోలుఁడు, త్యాగచంద్రుఁడు, జితేంద్రియుఁడు. ఇట్టి వటువీరుని చరితము యువకులకు సన్మార్గ బోధకము కాఁగలదని భావించి లిఖించితిని. ఈకథ యిదివరలో నాచే "శ్రీరామవిజయ పూర్వకాండమున" వర్ణింపఁబడి యున్నదియే; విద్యాధికులగు పెద్దలు కొందఱు దీనిం బ్రత్యేకముగా వ్రాయఁ బ్రోత్సహించుటచేఁ గొంచెము సవరించి, కొంత సాగించి, తిరుగ వ్రాసితిని.

కమలముకుళము పని జలములనుండి పైకి వెలువడుటయే. ఆపైని దానికి వలయు వికాసామోదముల సమకూర్చు కార్యము దినకరునిపై యున్నది. అటులనే కావ్యకోశము కృత్యము కవిహృదయమునుండి బయలువెడలుటయే. అందుపై

# శ్రావణవిజయము.

## ప్రథమాశ్వాసము.

సన్మైత్రి.

శ్లో. పితృసేవావ్రతం నౄణాం కీర్తిదం ముక్తిదాయకం
వినాయేన మనుష్యాణాం సర్వే ధర్మా నిరర్థకాః.

సుపుత్త్ర పవిత్రితమగు త్రేతాయుగమున మథురాపుర వాసియగు రత్నగుప్తుఁడను వైశ్యకుమారుఁడును, పాటలీపట్టణ నివాసియగు సువర్ణగుప్తుఁడను, బేరికొమరుఁడును వారణాసి కేఁగి, వేఱువేఱు బసల నేర్పఱచికొని, వాణిజ్యవిద్య నభ్యసింపఁ దొడంగిరి.

ఇటుల విద్యాభ్యాసము సాగుచుండ నొక యేకాదశి నాఁడు రత్నగుప్తుఁడు ఉషఃస్నాన మొనర్పఁదలంచి, గంగానది కేఁగి, ప్రమాదవశమునఁ బ్రవాహములోఁబడి కొట్టుకొని పోవుచుండెను.

అంతకుమున్నే స్నానమొనర్చి, అట జాహ్నవీతటమున సంధ్యావందన మాచరించుచున్న సువర్ణగుప్తుఁడు రత్నగుప్తుని అసహాయస్థితినిఁ గాంచి, యీఁతయుం దారితేరినవాఁ డగుటచే డిగ్గున లేచి, ఆమిన్నేటినీటిలో నుఱికి, ఆ సాధునందనునికర మందుకొని, దరిఁజేర్చి, నీటనూరుటచే నాతనికి వాటిల్లిన యారాట

మును దగునుపచారములచే నపనయించి, కొంచెమూరటం జేకూర్చెను.

పిమ్మట నపగతాయాసియగు రత్నగుప్తుఁడు మెల్లగం గనులు తెఱచి, తనముఖమువైపు సాదరభావముతోఁ జూచుచున్న సువర్ణగుప్తునిఁ దిలకించి, యిట్లుపలికెను.

రత్నగుప్తుఁడు—ఆర్యా! మీరెవ్వరు? మృత్యుముఖమునఁ బడనున్న నాపైనిట్టు లవ్యాజానుకంపను జూపఁ గారణమేమి? మిము నేను గాపాడుఁడని, ప్రార్థింపలేదే! అప్పా! యప్పులఁబడి మడియనున్న నాముప్పు తప్పించి, కాపాడిన మీ యప్పుఁ దీర్ప నాకెట్లు సాధ్యమగును?

సువర్ణగుప్తుఁడు—సోదరా! ఆర్తులఁ గాపాడుట ఆర్యకుమారులకు సహజగుణము. వారికిఁ బ్రార్థనములతో నిమిత్తము లేదు. ఆపన్నులఁ గాంచి, కాపాడ నేఁగనివాఁడు ఆర్యకుల సంభవ సంపదకు అర్హుఁడు కానేరఁడు.

రత్నగుప్త—ఉదారాశయా! కారుణ్యముతో నను నీటిగండమునుండి కాపాడుటయేగాక, అమూల్యమగు నీతిబోధనుకూడఁ జేసియుంటిరి! ఈయుపకృతులు రెండును నేఁ గోరినవికావు. అయాచితముగ మీరే యనుగ్రహించితిరి. ఇఁక నే స్వయముగాఁ బ్రార్థింపఁదగినది నుఱియొకటి కలదు. దానిం గూడఁ బ్రసాదించినచో, నేధన్యుఁడనగుదును. నీటినుండి కాపాడఁబడిన యీవిధేయుని నేఁటినుండియు, మిత్రునిగాఁ బాటింపఁ

గోరుచున్నాను. నా భావిజీవిత దీపకళను మీ నిర్మల స్నేహ ప్రసారముచేఁ గాంతివంతముగాఁ జేసికొనన భిలషించుచున్నాను.

సువర్ణ—మిత్రమా! నే నెపుడు నీకరమునందికొని, నీరములనుండి నిను దరిఁ జేర్చితినో! యానిమిషముననే మన కిరువురకుఁ జెలిమి యేర్పడినది. ఇపుడు క్రొత్తగా నీవపేక్షింపఁ బనిలేదు. ఈహరివాసరము మొదలు ప్రాణములు మనదేహముల నుండి పైకెగసి పోవునంతకు మనమైత్రి నిరంతరాయముగ సాగు చుండుటయే నా యభీష్టము. ఈసుభాషితము విన్నతోడనే రత్న గుప్తుఁడు "ధన్యోస్మి." ధన్యోస్మి." అని పరమానందమందెను.

ఆదినము మొదలు ఆయూరుజనందను లిరువురు మిత్రులై మునుపటివలె విడివిడి వినుకుల వేఱువేఱుగా నుండఁజాలక, యొకయింటనే నివసింపఁదొడంగిరి. ఇట్లువారు క్రమముగా దృఢ తరస్నేహపాశ బద్ధహృదయులై, విద్యాభ్యాసముచేయుచు, కొంతకాలమునకు వార్తయందు ఉత్తీర్ణులై వారణాసిని వీడి, నిజపురములకుఁ జననెంచిరి. కాని, అసదృశమగు సహవాస సౌఖ్యమునకు నెడబాటొదవు మన్నంతలకు ఖిన్నులు కాఁ జొచ్చిరి.

అందుచే, వారు విద్యాభ్యాసమునకై కాశిని నివసింప నగత్యము లేకున్నను, ఒకరినొకరు విడచి యుండఁజాలక, కొంత కాలమునట కాపురమునందే కాపురముండిరి. కాని, వారితలి దండ్రులు ఇండ్లకురండని యుత్తరముల వ్రాయుచుండుటచే,

విధిలేక వెడలిపోఁదలంచి "ముందు మనకు దైవకృపచే సంతాన ముదయించినచో, పరస్పర బాంధవమును సమకూర్చికొందము. అట్లుచేయనిచో, వైశ్యకులమునఁ బుట్టనట్లే" అని యొట్టుపెట్టుకొని, కాశిని విడచి, స్వదేశములకు వెళ్లిపోయిరి.

కొంతకాలమునకు రత్నగుప్తుఁడు వ్యాపార మభివృద్ధి చేయఁదలంచి, అనేకామూల్య రత్నములను, ప్రశస్త వస్త్రములను, దీసికొని, యోడనెక్కి, సముద్రముపై విదేశములకేఁగి, ఆసరకుల నట విక్రయించి, అపారమగు ధనమును సంపాదించి తిరుగ స్వదేశమునకు వచ్చుచుండ నడిదారిలో నోడలోని మంచి నీరు సరిపోయినదని, పడవసరంగు రత్నగుప్తునకెఱిఁగించెను.

అంత నావర్తకుఁడు ఓడనొక యడవికడ నిలుపనియమించి, సేవకులఁ బిలిచి, అరణ్యములోనికేఁగి, మంచినీటిఁ గొనిరా నాజ్ఞాపించెను. ఆకింకరులు బిందెలను జేకొని, నావనుండి యొడ్డునకు దిగి, వనములోనికేఁగి, దాహోదకములకై వెదకఁ దొడఁగిరి.

అంతకుఁబూర్వ మామటవిని వింధ్యవాసినియగు దుర్గను సేవింపఁ గుటుంబసహితముగా నేఁగుచున్న, కేశవదాసుఁడను సేనానాయకుని మార్గమధ్యమున ఆటవికులగు చోరులు అడ్డగించిరి. ఆముట్టడిసమయమున ఆసేనానిభార్య తనచిన్న యాఁడుబిడ్డను ఒడిలోవేసికొని, పరిగిడి, ఒకచెట్టునీడను బట్టను బరచి దానిపై నాశిశువును బరుండఁబెట్టి, ఆపిల్ల యేడ్వకుండ జోకొట్టుచుండెను.

అపు డాపెను వెదకుచున్నదొంగలు కొంద ఱామెవైపు
నడ దొడంగిరి. చోరుల రాకనుగాంచి, ఆయిల్లాలు తాను శిశు
వుతోడ నే యున్నచో ఆదుష్టులు బిడ్డనుగూడ బాధింతురను భయ
ముచే ఆకూన నటవిడచి, వేఱొకచోటున కేఁగి నిలచెను. అంత
నాచ్చులాసాధ్వినిగాంచి, పరిగిడివచ్చి, యాపెమాటల నాలిం
పకయే బలవంతముగా లాగుకొనిపోయిరి. పాప మాయనాథ
శిశువు చెట్టునీడను బరుండి, పచ్చనియాకులసందునుండి ము
ద్దులుగాఁ గానవచ్చుచున్న, పూగుత్తులఁ జూచి, కిలకిల నవ్వుచు
నాడఁదొడఁగెను. ఇటులుండ మంచినీటికై తిరుగుచున్న రత్నగు
ప్తుని సేవకులు దైవవశమున నటకువచ్చి చెట్టునీడ నాడుకొను
చున్న ఆయాఁడుబిడ్డను గాంచి, అట్టిసొగసుగల పసికూన యా
యాఆడవి నొంటరిగా నుంట కబ్బురమంది, తమలోనొక్కని
యక్కడఁ గావలియుంచి, ఆయరణ్య మంతటను కేకలిడుచు
గాలించిరి. కాని, యాకూనను గన్నవారుకాని, తమయార్పుల
విన్నవారుకాని యాకానను గానరారైరి.

అంత వారొక సెలయేటినీటిని గలశములతోఁ జేకొని,
తిరుగశిశువుచెంత కేతెంచి, మున్నాబోటికడఁ గాపుంచినవానిని
తామువచ్చువఱకు ఆపాపను గాపాడుచుండుమని తెలిపి, యో
డకడ కేఁగి తమయేలికతో, ఆయనాథశిశుగాథను విన్నవించిరి.

రత్నగుప్తుఁ డాబిడ్డకబు రాలించినతోడనే మనసుకరుగ
నోడనుండి దరికివచ్చి, సేవకులవెంట ఆపట్టియున్న చెట్టుకడకుఁ

బోయి, అసదృశమగు సోయగముతోఁ జెట్టునీడను తెల్లనివలువపైని పాలకోనేటి నీటిపైఁదేలుచున్న కోమలారవిందకోరకమువలె ముద్దుగాఁ జూపట్టుచున్న యాపసిబిడ్డను గాంచి వత్సలుఁడై యాశిశువునెత్తికొని, మద్దిడి సేవకుల మరల వెదకిరండని నియోగించెను.

కింకరులును స్వామియాజ్ఞానుసారము తిరుగ నడవినలుగడలఁ దిరిగిరి. కాని ఏరును కానరాలేరి. అంత వారు మరలివచ్చి, రత్నగుప్తునితో "మాకెవ్వరును జూపట్టలేదు." అని నివేదింప ఆసాధుపుంగవుఁడు నౌకనుండి యొక రాగిరేకును తెప్పించి, దానిపైఁ దనయూరుపేరుల వ్రాయించి, యందుక్రింద "ఆ బాలిక బంధువులెవ్వరైనఁ దనకడకు వచ్చి ఆశిశువు తమదని ఋజువు చేసినచో బాలికనిత్తు"నని ప్రచురించి, ఆతామ్రఫలకము నచటి చెట్టునకుఁ గట్టించి, ఆబిడ్డను తనతోఁ దోడ్కొనిపోయెను.

పిమ్మట రత్నగుప్తుఁడు పాటలీపురమునకేఁగి, నిజమందిరమును సమీపింప, ఆతనియిల్లా లుల్లసితవదనయై, పతిపాదములకు వందనమాచరించి, నిజనాథుని లోనికిఁ దోడ్కొనిపోయి, సుఖాసీనునిగాఁజేసి, యిట్లు ప్రశ్నించెను. "ప్రాణేశ్వరా! విదేశములనుండి నాకేమి కానుక తెచ్చితిరి?"

రత్నగుప్తుఁడు:—శుభాంగీ! మునుపటివలె ఈసారి నీకు సాలెచీరలెవ్వియుఁ దీసికొనిరాలేదు. జీవకళావిలసితమగు నొక

యపూర్వ పారితోషికమును గొనివచ్చితిని. అని సేవకులచే నడవిలో దొరకిన బాలికను దెప్పించి, నిజకాంత కందిచ్చెను.

ఆసతీమణి సంతానము లేనిదగుటచే నమందానందముతో, ఆశిశువు నందికొని తనివిదీర ముద్దులిడెను. వారాపిల్లకు అన్నపూర్ణ యనిపేరుపెట్టి ఆబాలికను, అమితానురాగముతోఁ బెంచుచుఁ దమకు సంతతిలేదను చింతను మఱుపొందిరి.

"ఆహా! ఏమి! ఈయీశ్వర విలాసము! ఈచిరుపాప మొదట నొకపాదజకులమునఁ బుట్టి, పిమ్మట నట్టడవిని విడువఁబడి, అనంతరము శ్రీమంతుఁడగు వైశ్యవరునికి గారాబుపట్టియై లాలింపఁబడుచున్నది!''

అంతకుఁ బూర్వమే మధురాపురిని సువర్ణగుప్తునకు విశ్వేశ్వరకృపచే నొకసుతుఁ డుదయించెను. ఆకుమారునకు 'విశ్వనాథుఁ' డని పేరుపెట్టి సువర్ణగుప్తుఁడు మహానందముతో పెంచుచుండెను. క్రమముగా ఆబాలుఁడు పదునొకండేండ్ల ప్రాయమునకు వచ్చినతోడనే, ఉపనయన సంస్కారమొనర్చి, వేద వేదాంగాది విద్యల నభ్యసింపఁ జేసెను. ఇట్లా బాలుఁడు సకలకళా పరిపూర్ణుఁడై నవయౌవ్వన శోభితుఁడై తేజరిల్లుచుండెను.

అటఁ బాటలీపురమున అన్నపూర్ణ యుఁబరిణయానుకూలమగు నీడునకు వచ్చెను. అదివఱ కావైశ్యశిఖామణులిరువురు

కాశిని చేసికొన్న శపథమునుబట్టి తమపట్టియలకుఁ బెండ్లిండ్లు చేయసమకట్టిరి.

రత్నగుప్తుఁడు తనపుత్త్రికయగు అన్నపూర్ణను సువర్ణగుప్తుని నందనుఁడగు విశ్వనాథునకొసంగి, పాటలీనగరమున మహావైభవముతో వివాహమహోత్సవముల నెఱపెను. పరిణయమైనదిమొదలు ఆవధూవరులు ఘనానురాగముతో మెలఁగఁదొడంగిరి. అంతఁ గొంతకాలమునకుఁ గాలవశముచే అన్నపూర్ణ తలిదండ్రులు దివంగతులైరి. కోటీశ్వరుఁడగు నాపెతండ్రి ధనమంతయు కుమారులు లేకుండుటచే, అన్నపూర్ణకు సంక్రమించినది. ఇట్లు పుట్టినింటి సంపదయు, నత్తింటి విత్తమును కలయ ఆదంపతులభాగ్య మగణ్యమై వెలయఁదొడఁగెను. విధివశమున విశ్వనాథుని పితరులును శివసాయుజ్యమును జేరిరి. అందుచే అన్నపూర్ణావిశ్వనాథులు సంసారమునకుఁ బెద్దలైరి. కాని వారు విత్తాఢ్యులమని విఱ్ఱవీగక, వినయసంపన్నులై, దేశకాలపాత్రముల గుర్తించి, దానధర్మములఁ జేయుచు, స్వకులమునకు యశమును సమకూర్చుచుండిరి.

అన్నపూర్ణకుఁ జిన్ననాఁటినుండియుఁ, బరులకన్న మిడుటయన సంతోషము మెండు. ఈసంపదతోఁ బాటు ఆయలవాటును అభివృద్ధమాయెను. అందుచే, శూరసేనదేశమున ఆసాధ్వి పేరు ప్రసిద్ధిజెందియుండెను. ఆవణిగ్దంపతులు ధనధాన్యసంపన్నులై యెనలేనిసిరులతోఁ దులతూఁగుచున్నను, సంతతి లేని సంతాపము వారిని విడువదాయెను.

మానవానందము లెవ్వరికిని పరిపూర్ణములు కానేరవు. ఒకటియుండిన వేఱొకటి కొఱవడియుండును. సంతానప్రాప్తికై ఆజాయాపతులొనర్చు పూజలకును, దానధర్మములకును, మేఱలేకయుండెను. వా రట్లు కొంతకాలము సంతతికాంక్షులై ఈశ్వరారాధనము చేయుచుండ భగవత్కృపచే ఆసాధుకాంత గర్భవతియై పదినెలలునిండ శ్రావణశుద్ధ పూర్ణిమనాడు తూర్పు దెస జందమామను గనినట్లు ఆసుదతి సుతుని బ్రసవించెను. విశ్వనాథుఁ డాశిశువునకు శ్రావణుఁడని పేరుపెట్టి మహావైభవముగాఁ బుత్రోత్సవమును నెఱపెను.

శ్రావణుఁడు సితపక్ష సుధాకరుఁ డట్లు వర్ధమానుఁడగుచుఁ ఆరేండ్లప్రాయమువాఁడై యుండ శూరసేనదేశమున భయంకరమగు క్షామము సంప్రాప్తమాయెను. ఆకరవుచే జనులన్నాతురులై, విలపింపఁజొచ్చిరి. దేశమున నెటుచూచినను, "అన్నమన్న"మను ఆర్తనాదములు చెలరేగఁ దొడఁగెను. తిండిలేక మరణించినవారిసంఖ్య దినదినము పెఱుగఁజొచ్చెను. ఈఘోరవార్త అన్నపూర్ణ చెవికి ములుకువలెఁ దాకెను. ఆ దుర్వార్త విన్నతోడనే దేహము కంపింపఁ, గన్నుల విచారవారి వ్యాపింప, ఆసతీమణి వ్యాకులచిత్తయై, దుఃఖింపసాగెను. "సజ్జనులు పరదుఃఖదుఃఖితులుకదా!"

# ద్వితీయాశ్వాసము.

క్షామనివారణము.

అన్నపూర్ణ యార్తులకన్న మొసంగి, కాపాడ సంకల్పించుకొని, విశ్వనాథునికడ కేఁగి, నమస్కరించి వినయానత వదనయై, యిట్లు సంభాషింపఁ దొడఁగెను.

అన్న:—ప్రాణేశ్వరా! వింటిరా! కటిక కాటకము మాట! కట్టా! ఎంతటి భయానకమై చెలరేగుచున్నదయో! మనోవల్లభా! మన మీదుర్భిక్ష సమయమున వాణిజ్యమును గట్టిపెట్టి, అన్నార్థులఁ గాపాడఁ బూనికొనవలయును. అన్నము లేక యనేకులు ప్రాణముల విడుచుచున్నారఁట. కావున, ఈకటా పురక్కసి మనదేశమునుండి వెడలిపోవువఱకు మనమన్నదానము చేయవలయును. కాటకము తొలగినపిమ్మటఁ దిరుగ వ్యాపారము సాగింపవచ్చును.

ఆర్యోత్తమా! సోదరసంఘము కూడు లేక మాడుచుండ, నిశ్చింతగా మేడలలోఁ గూరుచుండుటయు, ఓడలలో విహరించుటయు, పక్వాన్నములమెక్కి భాగ్యవంతులమని విఱ్ఱవీగుటయు, మానవుల కెంతమాత్రము నుచితముకాదు. పరసంరక్షణా దూరులై, స్వసౌఖ్య సంపాదనమాత్ర పరాయణులై, జీవించువారికే రాక్షసులనిపేరు.

తత్వజ్ఞా ! ధనమును గాపాడవలయునని, దానినెట్టి యినుపపెట్టెలలోఁ బెట్టి, గట్టిగా నెంతటివిలువగల బీగములు వేసి బిగించినను, అది ఓరుగాలిలోఁబెట్టిన దీపకళిక యాఁరిపోవు నట్లు జారిపోవునే కాని, నిలువనేరదు.

ప్రియవల్లభా ! విత్తములు నిత్యములుకావు. తనువులు శాశ్వతములుకావు. త్యాగమొక్కటియే నిత్యమైనిలుచు పదార్థము. కావున, మనచేత ధనమున్నంతవఱకు అన్నాతురులైన సోదరీసోదరులకు భోజనమిడి, కాపాడవలసినబాధ్యత మానవులమగు మనపైనున్నది. పరులసంరక్షింపఁ బాటుపడువారలే యమరులు. కావున, నేఁటినుండియేమనము అన్నదానవ్రతమున దీక్షితులము కావలయును. "ధర్మస్య త్వరితా గతిః" అనియుండుటచే జాగుసేయరాదు.

విశ్వనాథుఁడు—దానశీలా ! ఇంపుగా నుపన్యసించితివి, నిజమే. చెఱువునఁజేరు నీటివెల్లువకుఁ బొల్లుకళింగయే రక్షకమైనట్లు చేతఁజేకూరు విత్తమునకు, ధర్మమే సంరక్షకము. ఇదియుఁ గాక మన మనుభవింపవలసిన సుఖములన్నియు నించుమించుగాఁ బూర్తియైనవి. వార్ధకముచే నవయువ పాటవము సడలుచున్నది. కావున, మనకిఁక ధర్మమే శరణ్యము. అందు కర్హమగు సమయమును సంప్రాప్తమైనది. "అన్నస్యక్షుధితం పాత్రం" అని ఆఁకలిఁగొని యున్నవారలే యన్నదానమున కర్హులు. అందును క్షామమున క్షుధితులఁ గాపాడువారు కైలా

సమున పార్వతీపరమేశ్వరులచెంత నానందించుచుందు రని శాస్త్రము తెలుపుచున్నది. మఱియు, దీనజనసేవయే ఈశ్వరారాధనము.

శుభాంగీ! నీవన్నట్లీనాడే యన్నదానవ్రతమున కుపక్రమింతము. పుణ్యకార్యారంభమునకు తిథి వార నక్షత్రాదులతో నిమిత్తములేదు. సత్కార్యప్రారంభమే పైవానిని బవిత్రము చేయఁగలదు.

నాకును, కాటకముమాట చెవినిఁ బడినతోడనే వాణిజ్యకాంక్ష సడలినది. ధర్మాభిలాష ప్రబలినది. అని యావైశ్యశిఖామణి నిజపరివారజనులను, నాప్తబంధువులను రాఁబిలచి, కర్తవ్యమును బోధించి, సర్వము నతివేగముగా సిద్ధముచేయించి, తనయర్థాంగితో నిట్లు పలికెను.

విశ్వనాధ—ప్రాణేశ్వరీ ! అన్నమిచ్చుట కన్నియు నిర్ణీతములైయున్నవి. నేను వీధిలోనిలిచి, యన్నార్తులను లోనికిఁ బంపుచుందును. నీ వాయతిథులకు నోగిరమిడి గారవించుచుందుము." అని శ్రుతిసుఖదమగు చల్లని మాటలఁదెలుప ఆయిల్లాలు, అంజలిఘటియించి పతికి వందనము లొనర్చెను.

"నిజమే, ఆర్యదంపతుల కలయికలిట్టివియే. వారు ధర్మాచరణమున నేకమనస్కులై యుందురు. కాని, భిన్నహృదయులై యుండఁజాలరు. వారితలపు లద్వైతానందకలితములు."

అన్నపూర్ణ నిజవల్లభుఁడు తన మనోరథమున కనుకూలుఁడగుటచేఁ బరమానంద భరితయై, స్నానమాచరించి, దీక్షా వస్త్రములఁ ధరియించి, విఘ్నేశ్వరు నారాధించి, చేతి కన్నదానవ్రత కంకణమును గట్టికొని, పరమేశ్వరప్రీతికై అన్న మొసంగ మొదలిడెను. క్రమక్రమముగా నానాఁటికానాఁడు మధురాపురిని అన్నపూర్ణ యార్తులనాదరించి, అన్నమిడుచున్నదను వార్త, దేశమంతటను వ్యాపించెను. అందుచే నాఁకలిబాధకుఁ దాళఁజాలనిజనులు గుంపులుగుంపులుగా ఆసతీమణి మందిరమునకు విధివిరామము లేకుండ రాఁదొడంగిరి. ఆదయావతియు వచ్చిన యతిథుల దైవసములఁగ భావించి, వారికిఁ గడుపార భోజనమిడి, తనపేరు సార్థకము చేయుచుండెను.

ఇట్లాకలవు పన్డెండేండ్లవఱకు దేశమును విడువక పీడించెను. అన్నపూర్ణ యాదీర్ఘకాలమంతయు విసుగుజెందక, యార్తుల కన్నదానము చేయుచుండెను. అట్లొనర్చుటచే వారి కడనున్న సొత్తంతయు వ్యయమయ్యెను. అంత వారు తాము కాపురము చేయుటకుఁ దగిన చిన్నయింటిని మాత్రముంచిపెట్టుకొని, మిగిలిన ప్రాసాదాభరణాది సమస్త పదార్థములను విక్రయించి, ఆధనముతోఁ దాము ప్రారంభించిన యన్నదానయాగమును నిర్విఘ్నముగా సాగించిరి.

దైవకృపచే ఆకలవు చల్లారి, ప్రజలు మధురాపురి నుండి తమతమ నెలవులకు మఱలిపోయిరి. కాని క్షామాంతిమ

దివసమున ఆవైశ్య కుటుంబమువారు తిరుటకాహారము సుర్లభమగు నవస్థకు వచ్చిరి. కాలవశమునఁ గటూపుతుదినాఁడు ఏకాదశి యగుటచే, ఆపుణ్యదంపతులు సుతునితోఁ గలసి యుపవసించి శ్రీహరిని ధ్యానించుచు, రాత్రి జాగరణము సేయుచుండగిరి. అపు డాకుటుంబమువారి యానందమునకు దరి కానరాకుండెను.

"నిజమే సామాన్యముగా నత్యల్పకృత్యములు నెఱవేరు నప్పుడే సంసారు లానంద పరవశులగు చుండ అనన్యసామాన్యమగు నంతటి అన్నదాన యాగమును ద్వాదశవర్షములు నిర్విఘ్నముగా సాగించిన దానశీలుర సంతోషమునకు మేరయుండునా?"

నిశ్శబ్దముగా నున్న యానిశీథమున వారుముగ్గురు నిట్లు ప్రసంగింప మొదలిడిరి.

అన్నపూర్ణ—హృదయేశ్వరా! పార్వతీపతికృపచే క్షామకాలము దాటి సుభిక్షసమయము మేతెంచినది. ఆనాఁటి క్షుధార్తుల కరుణభాషణములు ఇపుడు వినవచ్చుటలేదు. మీ దయచే నేఁదలపెట్టిన యన్నదానవ్రతము శుభాంతముగా ముగిసినది. నామనోరథము సిద్ధేర్చితిరి. దయానిధీ! ముందు జన్మమునఁగూడ నన్ను మీపదసేవకురాలినిగానే బుట్టునట్లు జగదీశ్వరుఁ డనుగ్రహించుఁగావుత!

విశ్వనాథుఁడు:—ప్రేయసీ! మనయింటి కన్నార్థులై వచ్చిన సంసారుల యవస్థలఁ దలంప గుండె చెఱువగుచున్నది.

ఎట్టి యభిమానశాలురును గూడ తిండిలేక మాడుచున్న దారా పుత్త్రాదుల వెంటనిడికొని, మనయింట భుజింప వచ్చిరే! ఓదయాళూ! జగదీశా! ఇకముందిట్టి కాటకముల రాకుండఁ జేయుము.

శ్రావణుఁడు:—జననీజనకులారా! ఈదుర్భిక్ష సమయమున చిదానందముతో మీరొనర్చిన యన్నదాన వ్రతమును గన్నులారఁ గాంచితిని. ఇట్టి దయామయులకు నందనుఁడనై బుట్టినందుకు గర్వించుచుంటిని. లోకమున ధనముల వెచ్చింపక, దాచుటయే సుఖమని తలంచువారు కానవత్తురుకాని, ధనత్యాగమే యానంద జనకమని భావించువారు చూపట్టరు. పితరులారా! మీరు ఆస్తులఁగాపాడ ధనము చాలదేమోయని, బెంగటిల్లితిరేకాని విత్తమంతమగుచున్నదని విచారింపరైతిరి! ఇదికదా దాతృత్వమన!

ఇట్లా సతీపతిసుతులు ముచ్చటించుచు, కూడులేని స్థితికి వచ్చియుఁ దమ బీదరికమునుగూర్చి విచారింపక, పరులకన్నమొసంగినందుకు సంతసింపఁజొచ్చిరి.

అట్లు వారారాత్రి సంతోషపరవశులై గడుపుచుండ మూడవజామున నలుగు రన్నార్తులు అన్నపూర్ణ యింటిముంగిట కేతెంచి "అమ్మా! అన్నము." అని దీనముగాఁ బలుకఁ దొడంగిరి. ఆసన్నస్వరము చెవికిఁ దాకనతోడనే సంతసమంత రించి తిరుగ ఖేదముదయింప, అన్నపూర్ణ భర్తతో నిట్లుపలికెను.

అన్నపూర్ణ:—జీవితేశా! ఎవ్వరో యన్నమని నీరసంపు నెలుంగుతోఁ గేకలిడుచున్నారు. కావున, వారలెవ్వరో కనుగొనుడు. కట్టా! దిక్కుమాలిన కఱవికను జనులఁ బీడించుచున్నది కాఁబోలు. అన విశ్వనాధుఁడు వీధిలోని కేగి, తనుగృహమునకు ముందు, శవాకారములతో నిలిచియున్న నలుగురు దీనులఁగాంచి "ఆర్యులారా! మీరలెవ్వరు?" అన అందొక యువకుఁడిట్లు ప్రత్యుత్తరమొసఁగెను.

యువకుఁడు:—మహాశయా! నాలుగుదినములనుండి మంచినీళ్ళుతప్ప అన్నమెరుంగము. అన్నపూర్ణ చేయుచున్న యన్నదాన మహిమమును విని తిండిలేక మాఁడుచున్న తల్లిదండ్రులను, ఆకలిగొనియున్న యాలిని వెంటనిడికొని, అన్నార్థమై యెటులనో యిటకువచ్చితిని. దయానిధీ! మాయాకలిబాధ నాదయావతి కెఱిగించి, మాప్రాణములను నిలువబెట్టుము. ఇక నేమాటలాడఁ జాలను.

విశ్వనాధుఁడు:—ఆర్యులారా! భయపడకుఁడు. తెల్లవారనున్నది. ప్రొద్దుపొడువగనే మీకందరకు భోజనమొసంగుదుము. అని మెల్లగా వారిని లోనికిఁదోడ్కొనివచ్చి యొకగదిలోఁ బరుండఁబెట్టి, భార్యకడకేగి ఆయార్తుల దుస్థితినిఁ దెలిపెను. ఆదీనానుకంప యావార్తను విన్నతోడనే కొయ్యబారి కొంతవడికి దెలివినంది భర్తనుగాంచి యిట్లుపలికెను.

అన్నపూర్ణ:—ప్రాణేశ్వరా! తెల్లవారినతోడనే మనము వీరికన్నము పెట్టవలయును. లేకున్న వీరలు మనయింటఁ బ్రాణ

ముల విడచుట తప్పదు. ఇపుడు మనకడ నొకగవ్వ కూడలేదు. ఏమిచేయుదుము! ఇంతదనుక నడిగినవారికి లేదనక యన్న మొసంగి యుంటిమి. కాని, ఈనాఁడు వీరినిఁ గాపాడుట యెట్లు? కంఠమునఁ బ్రాణములుండ అన్నమిడుట మావలన కాదని మననాలుక లెట్లు పలుకును? మనకన్నులు ఈదీనుల యంత్య దశ నెట్లుచూడఁగలవు? ప్రాణేశ్వరా! ప్రామోపవేశముచే వీరిమృతికంటె ముందు మనము బ్రాణములఁ బరిత్యజింతము. ఇదియే, ప్రస్తుతకర్తవ్యము. వేఱుదారి కానవచ్చుటలేదు.

విశ్వనాథుఁడు:—కటకటా! ఇంటఁ బూజనీయులగు అతిథులు అన్నాతురులై పడియుండ, వారినాదరింపక ఆత్మ హత్యలఁ గావించుకొనుట పాపహేతువు కాదా? యముఁడు మనల దండింపఁడా?

అన్నపూర్ణ:—అగును. పాపకారణమే యగును. సందియము లేదు. కాని వారినాదరించి, అన్నమిడుట యెట్లు? కావున, వారియాఁకలి బాధలఁజూచుచు, జీవించుటకంటె మనము మరణించి, నరకవ్యథల నందుటయే లెస్స. అని చేతులు జోడించి, భగవంతుని ప్రార్థింపదొడంగెను.

“ఓ! సర్వజ్ఞా! సర్వాంతర్యామీ! దీనావనపారీణా! కరుణామయా! మాగృహమునకు వచ్చిన యతిథులు జీవించి యుండగనే, మాజీవితముల ముగింపఁ జేయుము. నేడేకాదశి యగుటచే, ఈరాత్రి మేము మరణించినచో, నీపాదములకడఁ

జేరగలుగుదుము. అని శ్రావణు నవలోకించి, "బిడ్డా! యొక్క సారి మనసుదీర ముద్దిడనిమ్ము. మాజీవితములు ఈరాత్రితో ముగియనున్నవని తెలిసికొనుము. ధీరుఁడవై యుండుము."

శ్రవణుఁడు:—మాతరో! ఏల! యిట్లు బేలవైవాపో యెదవు? నిరీహతో, నీశ్వరార్పణముగాఁ గోట్లకొలది ధనములఁ ద్యాగమొనర్చి, కన్నతల్లివలె ఆర్తజనసమూహముల కన్న మొసంగి, కాపాడిన కరుణాలవాలవు. అనవృశదానశీలవు. బుధనుతచరితవు. అట్టినీవు సంతసింపవలసిన సమయమున ఇట్లు సంతపింతు వేలనమ్మా! అమ్మా! విచారింపకుము. రేపు నీ పీయన్నాతురులకుఁ గూడఁ గూడొసంగఁగలవు. దయాళుఁడగు భగవానుఁడు, నీయట్టి సతీమతల్లుల మనోరథములఁ దప్పక యీడేర్పగలఁడు, సందియము లేదు.

అన్నపూర్ణ—వెట్టివాఁడా! కరమున నొకకాని కాని, యింట గంటెడు గంజికాని, లేక నిఱుపేదలమై ప్రాణములతో నిలచియున్న మనము నలుగురు క్షుధార్తులకు భోజన మెట్లు పెట్టఁగలము?

శ్రావణుఁడు:—మాతరో! భీతిల్లకుము. నాజనకుఁడు ఘనానురాగముతో నీగళమునఁ గట్టిన మంగళసూత్రము ప్రకాశించు నంతవఱకు, నీకర మన్నమొసంగునే కాని, లేదను సంజ్ఞను చేయఁజాలదు.

వ్యక్తతయేకాక, కర్మవశమున నాథత కూడ సంప్రాప్తమాయెను. ఎంతటి పుణ్యాత్ములకును పూర్వజన్మ కర్మఫల మనుభవింపక తీరదు. కావుననే పుట్టినదిమొదలు గిట్టువఱకుఁ బుణ్యకార్యములు తక్క వేఱొండెగ్గెఱుంగని సజ్జనులకుఁగూడ దుర్భరదుఃఖములు సంప్రాప్తమగుచుండును. "నాభుక్తం క్షీయతే కర్మ" "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం" అని యీ శాస్త్రములు తెలుపుచున్నవి. అందుకీసాధుదంపతుల జీవితములే తార్కాణములు.

# తృతీయాశ్వాసము.

## తీర్థాటనము.

శ్రావణుఁ డాపేదరికమున వృద్ధాంధులగు పితరులకు భక్తిప్రవత్తులతో సర్వోపచారములఁ జేయుచుఁ గన్నులను రెప్పలట్లు కాపాడఁ దొడంగెను. కాని, వా రేపూటకాపూట తిండికై తడివికొనవలసిన యవస్థకు వచ్చిరి. అపు డావృద్ధులు తమపుత్త్రునితో నిట్లు పలికిరి.

వృద్ధులు:—ప్రియతనయా! మామూలమున నీ వెంతటి శ్రమలపాలగుచుంటివి! ఇపుడు మాకడ నిలదియున్నది. నీసద్భక్తి సంపద తప్ప వేరెట్టి సొత్తును లేదు. మాతలిదండ్రులు మము గోటీశ్వరులనుగాఁ జేసియుండ, నీపితరులు నిన్నుఁ గూటికిఁ బేదనుగాఁ జేసిరి. సుతరత్నమా! మేము నిన్ను నిఱుపేదనుగాఁ జేయుటయే కాక, ముసలివారమై గ్రుడ్డితనమునఁ బడి యుండుటచే, నీస్వేచ్ఛావిహారసుఖము నరికట్టి, అహర్దివము నీచే సర్వోపచారములఁ జేయించుకొనుచుంటిమి. తండ్రీ! ఇకముందు మమ్మెట్లు పోషింపఁగలవు ?

శ్రావణుఁడు:—ఆర్యులారా! అనశ్వరములగు మీపాదారవిందసేవాసంపదల నాకొసంగి, నన్ను భాగ్యవంతునిగాఁ జేసియుంటిరేకాని దరిద్రునిఁ గావింపలేదు. కావున, మీరు

నన్నుఁదలంచి, విచారించుట భావ్యముకాదు. పూజ్యులారా! పితరులారా! నాకు ధనములేదను చింత యావంతయు లేదు. త్రికరణశుద్ధిగాఁ దెలుపుచుంటిని. కరమున భిక్షాపాత్రమును బట్టి "భవతి భిక్షాందేహి" అని ఈపురనాగరికుల యాచించి, యా పావన మధుకరాన్నముతో మిమ్ముఁ బోషింతును. బ్రహ్మచారికి భిక్షాటనము పరమపావనము; గౌరవావహము.

అన్నపూర్ణ:—వత్సా! పాపము శాంతించుగాక. మనమెచ్చటఁ బరమాన్నభరితములగు రజితపాత్రలఁ జేతనిడికొని, యతిథులకు బాయస మొసంగితిమో ఆపట్టణముననే భిక్షాపాత్రమును గరమునఁ బెట్టికొని, తిరిపెమునకై తిరుగుట తగవగునా? కావున మన మీఏటిని వీడి, వేఱొక పట్టణము నకుఁ బోవుదము. పేదరికమున పరిచితులనడుమ నుండుట మర్యాదకాదు.

విశ్వనాథుఁడు:—కుమారా! నీమాతమాటలు నాకు నచ్చినవి. ప్రస్తుతము మనమున్న యీచిన్నయింటిని విక్రయించి ఆధనముతోఁ బుణ్యతీర్థముల సేవింతము. ఇది నీ కభిమత మగుచో వెంటనే యీయింటి నమ్మివేయుము.

శ్రావణుఁడు:—పితృదైవతములారా! మీయభీష్టముల దీర్చుటయే నా కభిమతము. అని యింటిని విక్రయించి ఆవిత్త ముతో కావిబట్టలను తట్టలను మట్టులను కావడినిఁ గొనితెచ్చి తలిదండ్రులకు కాటీచీరల గట్టబెట్టి తానుగూడ కావిబట్టల

ధరియించి తట్టలలో మెత్తగఁ బట్టలఁబరచి వాని యందుఁ బితరులఁ గూర్చుండఁబెట్టి కావడి భుజముపై నిడికొని, వేఱొక చేతఁ దాటియాకు గొడుగునుఁ బట్టి భగవన్నామోచ్చారణము జేయుచు మధురాపురిని విడిచి, పితరులఁ బుణ్యతీర్థములకుఁ బరమానందముతోఁ గొంపోవుచుండెను.

ఇట్లా నెగమనందనుఁడు మధురానగరమునుండి బయలువెడలి క్రమముగా జననీజనకులచేఁ బుణ్యతీర్థముల సేవింపఁ జేయుచు నొకనాఁడు వింధ్యపాదములదరినిఁ బడి, పశ్చిమసాగర తరంగమాలికల నాలింగనమొనర్పఁ బరుగిడుచున్న శర్మద యగు నర్మదకుఁ దలిదండ్రులఁ గొంపోనెంచి, వింధ్యాటవీ మధ్యమునుండి ప్రయాణము సాగించు చుండెను.

వా రాయరణ్యమునఁ గొంత దూరమేగుసరికి కొండ లోయలలోనుండి కొందఱు కోయలు వచ్చి, ఆసాధుకుటుంబము వారిని "ఆగుడిట, ముందునకు సాగితిరా తలలు పగులఁగలవు." అని గర్జించుచు, నడ్డుతగిలిరి. ఆక్రూరభీకరాకారులఁ జూచి శ్రావణుఁ డిట్లు పలికెను.

శ్రావణుఁడు:—అన్నలారా! మీరలెవ్వరు? మమ్మేల ముందునకు నిరోధించుచుంటిరి? అయ్యలారా! క్రోధావేశ పరవశులై వృథాగా వృద్ధాంధులగు నా తలిదండ్రుల బాధింపకుఁడు. మీకు మాపై నలుక కలిగినచో నాపైఁబడి కొట్టుఁడు. ఇవె వందనములు.

కోయలు:—ఓయీ! తాపసకుమారా! మే మీకోన లోనుండు దొంగలము. మాకుఁ గావలసినది విత్తము. మీకడ నున్న డబ్బును మాకొసంగి మీదారిని మీరేగుడు.

శ్రావణుఁడు:—సోదరులారా! నాకడ మీకుగావలసిన సొత్తేదియు లేదు. ఇది సత్యము.

ఆమాటల విని, ఆదొంగలదొర "ఒరే! తమ్ములారా! ఈతపసికుఱ్ఱఁడు నిజమాడుచున్నాఁడురా! ఈతని మొగము జూచినకొలది నామనసులో సంతోస మొదవుచున్నదిరా! పరికించిచూడ ఈకావడివాఁ డెవ్వఁడో గొప్పింటి బిడ్డఁడు లాగున్నాఁడు. కావున, నీయయ్యకత యేదియో తెలిసికొందము. అయారే! ఈపిన్నవాఁ డెంతందముగా నున్నాడు! ఆహా! ఈతనిమాట లెంత సొంపుగా నున్నవి!" అని శ్రావణు నిట్లు ప్రశ్నించెను.

కోయ:—ఓపిన్నవాఁడా? మీ రేడకుఁ బోవుచుంటిరి? మిమ్ముఁజూడ గొప్పింటఁ బుట్టినవారుగాఁ గనఁబడుచున్నారు. కావున మోసముసేయక మీయూ రేదియో తిన్నగాఁ దెలుపుము. మేము మిమ్ముఁ జంపము. బెదరకుము.

శ్రావణుఁడు:—అన్నలారా! ఇప్పటి మాచరితము అంత రసవంతము కాదు. చావు దేహమునకుఁగాని ఆత్మకు లేదు. అందుచే నే మరణమునకు భయపడుట లేదు. మీక్రూర వ్యాపారమునకుఁ జింతించుచుంటిని. సౌహార్దముతో మీకుఁ గొంచెము మంచినెఱిఁగింపఁ దలంచితిని. విందురా?

కోయ:—అయ్యో! ఆమంచేదియో సెప్పము. ఇంపు గానుండిన నాలకింతుము. లేకున్న నేవగింతుము.

శ్రావణుఁడు:—సోదరులారా! మీరు బాటసారుల దోచుటకు దారులఁగాంచుచుంటిరేకాని దేహాంతమున సంభవమగు యాముని దారుణబాధల నెదిరించుటకు త్రోవలఁ దెలియనేరకుంటిరి. మింట వెలుగందు మెఱుపుతళుకులఁ గాంచి ఇంట దీపము లార్పుకొను వెంగలులట్లు దొంగసొత్తులకాశించి, పుణ్య సంపదలఁ బోగొట్టుకొనుచుంటిరి.

మిత్రులారా! పరులఁబీడించి సుఖింపఁ గోరుటకంటె ఇతరులఁ గాపాడుటకై ప్రాణములఁ ద్యజించుట లెస్స. మీరు సుఖింపఁగోరి కదా ఈక్రూరమగు చోరవృత్తికిఁ బాల్పడితిరి? కాని మీరు తలంచిన ట్లీ స్తైనకృత్యము సుఖదాయకము కాదు. పరిశీలించినచో దుఃఖోపద్రవ జనకము.

కనుఁడు. సుఖమనగా వ్యాకులపాటు లేక విశ్రాంతిగా నుండు మానసికావస్థ. మీ కీదొంగతనమున మనోవిశ్రాంతి యెన్నడైన కలిగెనా? లేదు. ఇదిమీయనుభవ గోచరమేకదా. దుఃఖమన మానసము భయాహతమై చంచలముగా నుండుస్థితి. మీరు దీనిని స్వయముగా ననుభవించుచునే యున్నారు. కోయలారా! మీ రీలోయలో నెన్నడేని హాయిగా నుంటిరా? లేదుకదా ?

మఱియు మీ రీ దస్యువ్యాపారమున నెంతధన మార్జించినను ఎల్లపుడు కొండగుహాలలోనో అడవిపొదలలోనో దాగియుండవలసినవారే కాని నిర్భయముగాఁ బురరాజవీథులఁ గాపురముండఁ జాలుదురా? ముచ్చుతనమున పొందుచున్నవి దుఃఖాగౌరవములుకాని మర్యాదాసౌఖ్యములు కావు. కావున నీనీచవృత్తినిఁ బరిత్యజించి, మంచిదారిని జీవింపఁ బ్రయత్నింపుడు.

అన్నలారా! నామాటలు మీ కిపుడు కటువులుగాఁ దోఁచినను వీని నోర్పుతో నాలించి యాచరింతురా! ఐహికాముష్మిక సంపదల రెంటినిఁ జేఁబట్టఁగలరు. పరుల ప్రేమించుట మానవధర్మము. ద్వేషించుట దానవధర్మము. ప్రేమద్వేషములకు వెన్నెలచీఁకటుల కెంత భేదమున్నదో అంతటి తారతమ్యమున్నది. ప్రేమయున్నచోట ఆనందసంపద తాండవించుచుండును. ద్వేషముకలతావున దుఃఖాగ్ని పొగలెగయుచుండును. కావుననే విబుధులు ప్రేమను బెంపుసేయుచుందురు. ద్వేషమును రూపు మాపుచుందురు.

సోదరులారా! తరుగుల్మలతాద్యచేతన జాతములు కూడ అయాచితముగఁ బరులకు ఫలకుసుమ కిసలయాది మనోహర పదార్థములొసంగి, సంతసము సమకూర్చుచుండ గోమహిషాది పశుయూథములు కూడ పయోదధి ఘృతాది రుచ్యవస్తువుల నిచ్చి, ఆనంద ముదయింపఁ జేయుచుండ, చేతన

శిరోమణులును వివేకసాగరులును అగు మానవులు స్వార్థ పరులై పరమార్థములకు బొల్పడుటకంటె నసహ్యాకృత్యము వేఱొండు కలదా? కావున, ఇట్లు దారులఁగొట్టి యట్టి యన్యాయార్జిత విత్తములతో సుఖింపఁ గోరకుడు. పరసుఖ సంఘటన పరాయణులై జీవితాంతమునఁ బాపహారియగు శ్రీహరి చరణసరసీరుహముల దరిఁజేరుఁడు. మీకు సద్బుద్ధి కలుగుగావుత!

అపు డాముచ్చులదొర కలుషహరమగు శ్రావణోపదేశమును విని, ముందునకు వచ్చి, ఆసాధుకుమారుని పాదములకు వందనమొనర్చి చేతులుమోడ్చి ఇట్లు ప్రశంసింపఁ దొడంగెను.

కోయఱేఁడు:—ఓయొజ్జలరతనమా! నేఁడు మాకెట్టి యితవులఁ గరపితిరి! మీహితవు లాలించుటచే మా తెలివిలేమి దొలఁగినది. వివేకోదయ మైనది.

ఆహా! దేశికేంద్రా! నిష్కలంకమగు మీ యుపదేశదర్పణమున మాపాప భూధర రూపముల ప్రతిబింబములు స్పష్టముగా దృశ్యము లగుచున్నవి. కటకటా! ఈపాడుపొట్టకే మే మెట్టి పాపములఁ జేసియుంటిమి. ఆబాలవృద్ధ మెందఱినో హతమొనర్చితిమి. అమూల్యమగు కాలమును దారుణకార్యాచరణమునకై వాడితిమేకాని, ఒకక్షణమైనను మోక్షకారణములగు రమారమణ చరణముల స్మరింప వినియోగింపమైతిమి.

ఇస్సీ! ఇంతకు మున్నార్తజన విలాపములు మాచెవు లకుఁ గోకిలమంజులాలాపములుగాఁ దట్టినవే కాని, శ్రవణ విదారణ రోదన ధ్వానములుగా వినరావయ్యెను. తుషారరాశి లోఁ దండులకణమున్నట్లు మాకృత్యపుంజములో సుకృత లేశ మేదియో యుండనోపు. లేకున్న, ఈకిరాతజాతులకు, మీయట్టి సజ్జనుల సందర్శన మెట్లు సంప్రాప్తమగును ?

ఆచార్యోత్తమా! మీయుపన్యాసప్రభావ మేమియో కాని, అద్దాని నాలించినదిమొదలు మున్ను మే మొనర్చిన పనులు నీచాతినీచములను తలఁపు లుదయించినవి. మీరు సెల విచ్చినట్లు మాగుండెలు జెండాగుడ్డలవలె నెల్లప్పుడు దడదడఁ గొట్టుకొనుచునే యుండును. పదుగురు కంటఁబడిన మముఁ బట్టవచ్చిరని పరుగిడుచుందుము. ఎన్నియోసారులు రాజభటు లచేఁ గొట్టబడి, చెఱలలోఁ బెట్టఁబడితిమి. కాని నారిసడలిన తోడనే వింటిబద్ద వంపుపీడి, నిడివియగునట్లు మేము, చెఱనుండి విడువఁబడినతోడనే జంకుపీడి, దుండగములకుఁ దొడంగు చుంటిమి.

శ్రావణుఁడు:—సోదరులారా! పరులహింసింపక సుఖముగ జీవింప ననువగుసంపదలీయడవియందు నిండియున్నవి. కనుడు. ఈవనమున హాయిగా నిద్రింపఁదగు తరుచ్ఛాయలు లేవా? దాహశాంతినిఁ జేయఁజాలు వినిర్మలములగు నదీజలములు లేవా ? ఆఁకలిదీర్పనగు వనతరుఫలములు లేవా ? ఎండవానల

నుండి గాపాడ సమర్థములగు కొండగుహలు లేవా? వీని నెల్ల విడచి, మీరేల యీపాడు బందిపోటుతనమునకుఁ బాల్పడితిరి?

కోయవేఁడు:—గురూత్తమా! అది మాజన్మాంతర దురితదోష మైయుండును. మే మిదివఱకు గడపినవి యంధకార బంధురములగు నిశాసమయములే. సందియములేదు. ఇప్పుడు మీముఖచంద్ర సందర్శనముచే మాకు వివేకచంద్రికా భాసురములగు సితపక్షములు సంప్రాప్తమైనవి. సజ్జనావతంసా! ఇఁకముందు మేము సత్పథమున సంచరింతుముకాని, కుమార్గమున మసలఁ బోవము. మీ తిరుచరణములాన. దేవరా! "ఇప్పటి చరితమంత రసవంతము కాదు." అంటిరి. దీనింబట్టి చూడ ఇంతకుఁ బూర్వంపు చరిత్రము శ్రావ్యమై యుండనోపు. కావున, దేవరవారి యుదంతమును సాంతముగా వినిపింపఁ బ్రార్థించుచున్నారము. గురుచంద్రచరితములును, చందమామ వెలుతురులును, సంతాప నివారకములు.

శ్రావణుఁడు:—సోదరులారా! మీరు పూతచేతసులై నందు కెంతయు సంతసమందితిని. వినుఁడు మాయుదంతమును. ఆమధ్య దుర్భరతమమగు కఱవు వచ్చినసంగతి నెఱుంగుదురా?

కోయ:—ఎఱుంగ కేమి సామీ! ఆకాటకమున జనులు తిండిలేక మలమల మాడిపోయిరి కదా!

శ్రావణుఁడు:—ఆక్షామకాలమునఁ బ్రేమతో నార్తుల కన్న మొసంగి, కాపాడినవారి పేరుల వినియుంటిరా?

కోయ:—వింటిమి గురూ! వారిపావన నామములు. గంటిమి వారిపుణ్య రూపములు. తింటిమి కడుపార, వారి యన్నములు. ఆహా! యాకాటకమున వారు సాగించిన యన్నదాన మొకనాఁడా! ఒకయేఁడా! ద్వాదశవత్సరము లొక్క రీతిని సాగినది.

ఆకష్టసమయమున దయామయులగు అన్నపూర్ణావిశ్వేశ్వరులు, కాశీనగరమును వదలి, మధురాపురిని మానవ రూపములతో నివసించి, అన్నాతురుల సంరక్షించిరని, మాతలంపు. ఆర్యవర్యా! ఏమని తెలుపుదు ఆదంపతులయాదరము? ఓగిరి మిడి, గారవించుటలో వారికిఁగల యోర్పు అనన్యదుర్లభము.

శ్రావణుఁడు:—అన్నలారా! అట్టైన ఆకష్టములలోనున్న వారు మీరెన్నుచున్న పుణ్యదంపతులగు అన్నపూర్ణావిశ్వనాథులే. ఈసేవకుఁడు వారిసుతుఁడే. ఆమాటలు వినినంతనే యాకోయలెల్లరు నొక్కపెట్టున లేచి, అవృద్ధదంపతులకడ కేఁగి, సాగిలఁబడి నమస్కరించి, చేతులుజోడించి, కన్నులనుండి యానందవారిబిందువులు నేలఁబడి చిందు, ఇట్లు స్తుతించిరి.

కోయలు:—ఆపద్బాంధవులారా! ఓయన్నపూర్ణావిశ్వనాథులారా! అన్నములేక కంఠగతప్రాణులమై, మీరా యింటినిఁజేరికొన్న మమ్మెల్లర మధురాపురిని మధురాన్నములనొసంగి, కాపాడితిరి. మీయాదరముచేమాయాఁకలి తీరెను. కాని, మాయవినీతి తొలఁగదాయె. ఇపుడు, మీసుతుని

హితోపదేశములు నూపాపములం బారంద్రోలి, మమ్ముం బావనాశయులనుగాం జేసినవి.

ఆర్యులారా! ఇదే మీపాదములం బట్టి, యొట్టు పెట్టి కొనుచున్నాము. ఈసుదివసము మొదలు జీవితాంతము వఱకు సన్మార్గమున సంచరింతుము. శక్తికొలంది ఈదారి నేంగుబాట సారుల కన్నపానీయాది సౌకర్యముల సమకూర్చి, ఆదరించుచుందుము. మిము సందర్శించిన ఈప్రదేశమునకు శ్రావణాశ్రమ మని పేరిడి, మాగురురూపము నిటం బ్రతిష్ఠించి, నిత్యము పూజించుచుందుము.

ఓకరుణామయా! దయధౌరేయా! మాదొక ప్రార్థన ము కలదు. వినుడు మాపాప పరిహారముకొఱకు మేము కొంచెము గురుదక్షిణను సమర్పింప నెంచితిమి. మాయందు వాత్సల్యముంచి, దానిని స్వీకరింపం గోరుచున్నాము. అని కొండలోయలోనుండి ధనభాండమును గొనివచ్చి, వారిపాదముల ముందుంచిరి.

శ్రావణుండు:—సదాశయులారా! సోదరులారా! మీరు పునీతమానసులగుటయే నేనభిలషించు భాగ్యము. ఈనిర్జీవిత విత్తము కాదు. మిత్రులారా! ఈధనమును మీరు చేయం బోవు ధర్మముల కుపయోగింపుండు.

కోయ:—దేశికవరేణ్యా! "గురుదక్షిణలేని యుపదేశ ముపకారకము కానేఱ"దని, పెద్దలు తెలిపి యున్నారు.

కావున నిషేధింపక, చేకొని మాకు మంగళానుశాసనములు అనుగ్రహింప వలయును.

శ్రావణుఁడు:—అన్నలారా! మీరు ప్రసన్నమానసులై కోరుచుంటిరి కావున ఈసొత్తులోనుండి కొంచెము విత్తమును జేకొందును. మిగిలిన ధనము నుత్తమకార్యములకే వినియోగింపఁ గోరుచున్నాను. సోదరులారా! నా యాతుదిమనువుల వినుఁడు. ధనవ్యామోహితులై తిరుగఁ జోరవృత్తినిఁ బరులఁ బీడింపక, మీభావజీవనములు భక్తినదీప్రవాహమునఁ బడి, బ్రహ్మానందసాగరమును జేరి, అందు లీనమగునట్లు చేయుఁడు. ఈదృశ్యమంతయు నశ్వరమనియు, ఈశ్వరుఁడొక్కఁడే శాశ్వతుఁడనియు, విశ్వసింపుఁడు. జాతువు లెండమావులఁ జూచి, జలము లనుకొనునట్లు విషయసంచయములఁ గాంచి, భోగ్యవస్తువులని భ్రమయకుఁడు. అహింసాజీవనమే సంసారుల శ్రీహరి చరణ సరసీరుహ సన్నిధానమునకుఁ గొంపోవు సాధనమని, తెలిసికొనుఁడు. మేము తీర్థాటనమును ముగించి, తిరుగ నీదారిని వచ్చునప్పటికి మీఘనోదార ధర్మకార్యములఁ బరికించి, సంతసించు భాగ్యమును మాకు సమకూర్పుఁడు. పోయి వచ్చెదము. మీసద్భావములు స్థిరమగునటుల భగవానుఁ డనుగ్రహించుఁ గావుత! అని బోధించి, వారలవీడ్కొని, వెడలిపోయెను.

"ఆహా! సజ్జనసాంగత్యమున కెంతటి సామర్థ్యము కలదు! శ్రావణబోధలు చెవినిఁ బడినది మొదలు క్రూరులగు

గాకోయలు శాంతచిత్తులై పాంథుల సేవింపమొదలిడిరి. నిజమే. ుపవిన్యాసములచేఁ జీఁకటియు, సజ్జనోపన్యాసములచే నజ్ఞానముసు దొలఁగును."

పిమ్మట శ్రావణుఁడు రేవాతీరమునకేగి, యాసోమోద్భవానీరముల పితరులతో స్నానపానాదులఁ దీర్చి, అటనుండి ఉజ్జయినికిఁ బ్రయాణమును సాగించుచుండ మార్గమధ్యమున గాలివాన రాగా ఆతఁడు పితరుల నొకవిశాల సాలమహీరుహముకడకుఁ గొంపోయి, ఆమద్దిచెట్టు క్రిందఁ గావడిని దింపి, తలిదండ్రులపై వాననీరు పడకుండ గొడుగును బట్టెను. కాని గాలి వేగముగా వీచుచుండుటచే ఆవృద్ధులు వర్షధారలకుఁ గొంచెము లోనైరి. వాన వెలియువఱకు వా రాతరుతలముననే నిలిచియుండిరి.

---

# చతుర్థాశ్వాసము.

## ఉజ్జయనీప్రవేశము.

ఒకదినాంతమునఁ జీఁకటిచేడియ జేగురునీరెండ నప్పటి మాటునుండి వెలికి రానుండ, తిండికై నలుగడల కేఁగిన తోడి పులుగులు తిరుగ గూడులఁ గూడినదియు లేనిదియుఁ గూడబలుకు కొనుచున్నవో యనునట్లు నీడములనుండి యండజ నివహములు కూత విడుచుండ శ్రావణుఁడు పితరులఁ దోడ్కొని రెండవ కుబేరపురమో యనునట్లు సర్వసంపదలతోఁ దులదూగుచున్న సువిశాలమగు విశాలాపురినిఁ జేరి, ఒకనెలవుకడ కేఁగి, ఆయింటి కంటియున్న వీధియరుగుపైఁ దల్లిదండ్రులను గూర్చుండఁ బెట్టెను.

ఆనాడు చలి మిక్కుటముగా నుండుటచేతను దారిలో వానకుఁ దడియుట వలనను వృద్ధులగు వైశ్యదంపతులు గజగజ వణుకఁ దొడఁగిరి. శ్రావణుఁ డదిచూచి, వెంటనే తట్టల యడుగుననున్న పొడిబట్టలఁ బైకిదీసి, వారికిఁ గట్టఁబెట్టి, వారు విడిచిన తడిబట్టలఁ బిడిచి, ఆయింటిచూరున కారగట్టి, ఇట్టుల పలికెను.

శ్రావణుడు:—జననీజనకులారా! ఇదే నే నాయెదుట నున్న యంగడి కేఁగి, మీ ఫలహారమునకై పండ్లను గొని తెత్తును.

అన్నపూర్ణ:—కుమారా! స్నానమాచరించినఁ గాని నీజనకులు ఫలములఁ జేకొనరు కదా! ఈనాఁడు శీతవాత మధికముగా వీచుచున్నది. అందుచేఁ జన్నీటితో జలకమాడుట దుస్సహము. మనకీసందెచీకటివేళ నీవీట నుష్ణోదక మెట్లులభ్యమగును? కావున ఈరాత్రి నిరాహారముగా నిద్రించుట మంచిది. బిడ్డా! నీవు ప్రయాణాయాసముచేఁ గడుఁ బడలియుంటివి. తిరుగ వేడినీళ్లకై తిరుగకుము.

విశ్వనాథ:—పుత్రరత్నమా! మీయమ్మ తెలిపినది సమంజసముగా నున్నయది. మే ముభయుల మీరాత్రి నిరాహారముగ నుండుటయే మంచిది. కావున ఫలాహారముకై పరుగిడకుము. నీ కాకలిగా నున్నచో నేవియేని ఫలములఁ దెచ్చికొనుము.

శ్రావణ:—పూజ్యపాదులారా! మన మిలువిడిచినది మొదలు పగలొకపూట భుజించి, రాత్రులు ఫలాహారమును జేకొనుచుంటిరి. అందుచే మీదేహబలము క్రమక్రమముగా నీరసించుచున్నది. పూర్వము పుష్టికరములగు మృష్టాన్నముల భుజించి, సుఖముగాఁ గాలముఁ గడిపిన మీకు నేనొండి పెట్టనుడికీయుడకని యొంటిపూటమెతుకులు బలమెట్లు కలిగింపఁ గలవు?

అన్నపూర్ణ—అమృతభాషీ! పితృపోషీ! దేహబలముకంటె మనోబల మెక్కుడు సౌఖ్యావహము. అయ్యది నీయుప

హాకహాతుచే దినదినప్రవర్ధమాన మగుచున్నది. అందువలన దేహములు కృశించుచున్నను, మాయాత్మలు శక్తివంతము లగుచున్నవి కాని, నీరసించుట లేదు.

శ్రావణుఁడు:—మాతరో! నే నాయాస పడుచుంటినని తలంచి, మీరిట్లు పలుకుచుంటిరి. నాపితరులు నిరాహారులై యుండుట నాకిష్టముకాదు. ఉష్ణోదకము నీయింటివారినడిగి తెచ్చెదను. ఈ భారతభూమిని సంసారులు బాటసారుల కోరికలనాదరింతురు. కాని నిరాకరింపరు. అని, యాయింటి కవాటముకడ కేఁగి, "అమ్మా! కొంచెముష్ణోదకము నొసంగుదురా?" యని యడిగెను. ఆమాట వినినతోడనే యాయింటిలోనుండి ప్రత్యక్షలక్ష్మియో యనునట్లు చూపట్టు నొకసతీమణి గుమ్మము కడకు వచ్చి, ఇట్లు ప్రశ్నించెను.

సతీ:—అన్నా! మీరెవ్వరు? వేడినీళ్లెందులకు?

శ్రావణుఁడు:—తల్లీ! వృద్ధులగు నాతలిదండ్రుల స్నానమాడించుటకు. ఇప్పుడు చలి మిక్కుటముగా నుండుటచేఁ జన్నీటితో నీవృద్ధుల స్నానమాడింప వెఱచి, మిముఁ బ్రార్థించితిని. అన ఆయిల్లాలు వీథివేదికపై నారముగ్గిన గుమ్మడిపండ్లవలెఁ దట్టలలో బట్టలు కప్పుకొనియున్న వృద్ధదంపతులఁ గాంచి, భక్త్యనుకంపలుదయింప,

"సోదరా! కొంచెమాగుము ముష్ణోదకము దోడ్కొని వత్తును." అని వేగముగా గృహములోనికేఁగి, బిందెలతో స్నా

నానుకూలములగు వేడినీళ్లఁ దోడ్కొనివచ్చి, గడపకడ నుంచి, "అన్నా ! ఇవిగో యుష్ణోదకములు. వీనితోఁ బితరుల స్నానమాడింపుము. వారు స్నానమాడినతోడనే ఈచలిగాలిలో నీవీధియరుగుపైఁ గూర్చుండఁ బెట్టక, లోపలి సావిడిలోనికిఁ దీసికొనిరమ్ము. మీకు ఫలాహారముల సమకూర్తును. మీ యట్టి సాధువుల రాకచే మాభవనము పావనమైనది.

శ్రావణుఁడు:—తల్లీ ! నీయట్టి సుగుణాలంకృతయగు నిల్లాలిని సందర్శించుటచే మేమెల్లరము పూతజీవితులమైతిమి. గంగాది పావననదీజలముల మునుంగుటకంటెను, శ్రీశైలాది పుణ్యక్షేత్రముల సేవించుటకంటెను, మీయట్టి సతీలలామల దయారసభరితములగు సంభాషణముల వినుట యెక్కుడు ఫలప్రదము. ఆహా ! మాపుణ్యమేమోగాని, ఈయుదయమున పాపహరములగు నర్మదానీరముల స్నానమాచరించు సంపద చేకూరినది. ఇపు డీసంధ్యాసమయమున శుభదమగు సతీసంభాషణము విను భాగ్యము సమకూరినది. అందుచే నీనాఁటి యుదయాస్తమయములు రెండును మాకు మంగళ ప్రదములైనవి.

సోదరీ! ఓహెూ! ఏమి నీయవ్యాజ కారుణ్యము! నీయీసోదరుఁడు వేడినీళ్లను గోరియుండ వెంటనే వానింగొని తెచ్చి, యొసంగుటయే కాక, మమ్మాదరించి ఫలహార మొసంగ నుంటివి. అమ్మా! నీవంటి దయామయులగు సతీమణులు స్త్రీజాతిలో వేయింటికొక రుందురో! యుండరో!

సతీ:—అన్నా! నేనెంత? నాకారుణ్యమన నెంత? మధురాపురనివాసిని యగు అన్నపూర్ణయను సువాసిని ఆర్తజనులపైఁ గురిపించిన కారుణ్యామృత వర్షముముందు ఇతరుల కరుణారసము కడలినీటికడ కేదారవారి వంటిది. ఆహా! ఆకరుణాలయయౌదార్య మేమని వర్ణింతును! పద్రేండేండ్లు అసంఖ్యాక జనసముదాయములకు ఆదరభావముతో అన్నమొసంగి, కాపాడినది. ఆపాడుకఱవునాట ఆయమ్మ ప్రసాదమొసంగి యాఁకటిబాధ బాపకున్న నెందఱో జనులు మిత్తినోటఁ బడియుందురు. ఆసాధువధూమణి దానమహిమము మాకుఁ దెలసినట్లు ఇతరులకుఁ దెలియదు.

శ్రావణుఁడు:—సోదరీ! మీకుఁ బ్రత్యేకముగా ఆయిల్లాలి యౌదార్యగరిమ తెలియవచ్చుటకుఁగల కారణమేమి?

సతీ:—విను మాతల్లి యోదనదాన మహిమము. అన్నా! ఆయన్నపూర్ణ ఆర్తజనసంరక్షణమునకై సర్వస్వమును ద్యాగమొనర్చి, కరమునఁ గాణముకూడ లేకయున్న సమయమున నాలుగు దినములనుండి తిండిలేక మాడుచున్న తలిదండ్రులను, నన్నును, వెంటనిడికొని, నానాథుఁడు అపరరాత్రమున ఆదయావతి నివాసమునకేఁగి, "అమ్మా! అన్నమన్నము" అని యఱచెను.

ఆయార్తనాదము చెవిఁదాకిన తోడనే యాసదాశయ తనమెడను మిగిలియున్న తాలి నమ్మించి, యాసొమ్ముతో

మాకు భోజనము సమకూర్చి, కొనయూపిరితో నున్న మా కుటుంబమును బ్రతికించినది. ఆనాఁడాయమ్మ మాకుఁ గూడిడ కున్న, ఈనాఁడు మిముఁజూచు భాగ్యము దుర్లభమై యుండె డిది. ఆదానశీల చేయు నన్నదానమునకు ఆమె పతిసుతులు కూడ సహాయులై ఆయన్నదాన యాగమునకు వన్నెఁదె చ్చిరి. కుటుంబమున అట్టైకమత్యముతో నుండవలయును. మే మిపు డాయిల్లాలి పేరుచ్చరించినఁ గాని కూటిని నోటనిడము. చిన్నటిచేయి ఆసతీమణి వదనారవిందమును గనులారఁ దిలకిం చినట్లు కలఁగంటిని. కాని ప్రత్యక్షముగా ఆపూతజీవితను జూచు భాగ్యమెట్లు లభ్యమగును?

శ్రావణుఁడు:--సాధ్వీతిలకమా! నీ కట్టి కోరికయున్నచో భక్తవత్సలుఁడగు భగవానుఁడు ఆయన్నపూర్ణను నీకంటెమె దుటఁ బ్రత్యక్ష్యము సేయఁగలఁడు. సతీలలామల మనోరథ ములు సంకల్పమాత్ర సంభవములు. ఇందులకు నిదర్శన మిపు డే చూడనగును.

సతీ:—ప్రియసోదరా! ఏది నీమాటల నిలువఁబెట్టి కొనుము.

శ్రావణుఁడు:—సోదరీ! చూడు మటు ఆముదుసలికి నెడ మతట్టునఁ దట్టులోఁ గూర్చుండి యున్న ముత్తైదువయే నీవు ప్రశంసించుచున్న అన్నపూర్ణ. ఆపుణ్యపురుషుఁడే ఆమె హృద యేశుఁడగు విశ్వనాథుఁడు. ఈ నీసోదరుఁడే పితృసేవారతుఁ

ఢగు శ్రావణుఁడు. అన ఆయువతి గృహములోనికేగి, యొకపెద్ద దీపమును గొనివచ్చి, ఆదీపియ వెలుఁగులో వారిని గుర్తించి, చేతనున్న దివ్వెను నేలనుంచి, సాష్టాంగముగ నాపెపాదములకడఁబడి, నమస్కరించి, ఇట్లు ప్రస్తుతింపఁ దొడఁగెను.

"ఓ దయారసపూర్ణా! అన్నపూర్ణా! నేఁ డెంతటి సుదివసము! ప్రత్యక్షశంకరివగు నిను గాంచుసంపద నాకు చేకూరినది. తల్లీ! ఈవిధేయ మున్ను నీవన్నమిడి బ్రతికించిన బిడ్డయే. అమ్మా! నన్నొక్కతెనె కాదు నీవుగాపాడినది. ఇంకను మున్నూరున్నారు. నానాథుఁడు రావెంటనే మే మందఱము కలసి మీకుఁ బూజయొనర్తుము. మే మీజన్మమున వేఱెట్టి పుణ్యకార్యమును జేయనక్కఱ లేదు. మీపాదాభివందనమే బ్రహ్మానంద సంధాయకము. సందియము లేదు.

అన్నపూర్ణ:—పుత్రీ! నీవినయోక్తుల కెంతయు సంతసించితిని. కాని, బిడ్డా! ఇపుడొక్కనికైనఁ బట్టెడన్నము పెట్టనేఱక జీవచ్ఛవమునై యున్న దానను. ఈపేదరికమున నినుఁ జూడ సిగ్గగుచున్నది.

సతీ:—ఓ యర్థిజనకల్పవల్లీ! సతీమతల్లీ! నీ వెంతమాత్రము పేదరాలవు కావు. నీయీపేదరికము విబుధగేయము. వర్షకాలమున మేఘమాలల నిజజీవనధారలచేఁ జేతనాచేతనజాతము నుజ్జీవింపఁ జేయును. శరత్కాలమున ఆకాదంబినియే నీరసమై యుండును. వసంతసమయమున మహీరుహపాళి సుమఫలసంపన్నమై, జీవకోటిని సంతసింపఁ జేయును. ఆకురాలు

కావున ఆతరుపం క్తియే సర్వోపహార్యమై యుండును. వఱదదిన ములలో నదులు కూలంకష వారిపూరితములై దేశమును సస్య సంపన్నముగాఁ జేయును. వేసవి నాతరంగిణులే సన్నబారి యుండును. అటులనే లోకము సౌఖ్యముగానున్న సమయమున వదాన్య భాండాగారములు ధనపూరితములై యుండును. ఆప త్కాలమున ఆకొట్టులే దీనజనోపభుక్తములై వట్టిపోయియుం డును. పైశ్రేణిలోని పదార్థములన్నియుఁ గలిమి లేముల రెం టను సమానగౌరవమునే పొందునుకాని రిక్తసమయమునఁ జుల కనగాఁ జూడఁబడవు.

కావున, మాతరో! నీవిపుడు ఆగ్రజనపాత్రతాత సంపన్నవై, శూన్య పాత్రములతో నున్నను, లోకమాన్యవగు మాతవేకాని సామాన్యనారివి కానేరవు. పరసంరక్షణోపయుక్త మగు పాత్రునకే భాగ్యమని పేరు. సాగరక్షారనీరములు అపా రములయ్యును పిపాసా శాంతినిఁ జేయఁజాలనట్లు లుబ్ధజనసం పదలు సమృద్ధము లయ్యును ఆగ్రజన సంతోషప్రదములు కానేరవు. అని సంభాషించుచుండ ఆయిల్లాలి వల్లభుఁడిల్లుచేరి, వీధియరుగుపై నున్న వృద్ధులను గుమ్మముకడనున్న పిన్న వానినిఁ జూచి, నిజకాంత నిట్లు ప్రశ్నించెను.

వల్లభుఁడు:—ప్రాణేశ్వరీ! ఈమహానీయు లెవ్వరు? ఈ యతిథిదైవతముల లోనికిఁ దోడ్కొనిపోయి యారాధింపక, ఇట వాకిట నేల నిల్పియుంచితివి ?

సతీ:—ప్రాణేశ్వరా! వీరా! మనము ప్రాణముల వీడ నున్నపుడు బువ్వపెట్టి, కాపాడిన తలిదండ్రులు. అన్నపూర్ణా విశ్వనాథులు. ఈపిన్నతమ్ముఁడు వారిప్రియనందనుఁడు శ్రావణుఁడు. అని తెలిపినతోడనే యాసతీపతి అవితర్కితముగా సంప్రాప్తమైన వారిరాక కచ్చెరువంది వారిపదములకు వందన మొనర్చి యిట్లు పలుకఁ దొడఁగెను.

వల్లభుఁడు:—ఓ పుణ్యచరితులారా! రేపు శివరాత్రి యగుటచే మహాకాళక్షేత్రమున కేఁగి, గౌరీశంకరుల సేవింప నెంచితిని. కాని యీనాఁడే భక్తజన కృపాళుఁడగు చంద్రమౌళి సతీసుతులతోఁ గలసి, దర్శనమిాయ ననుగ్రహించి, నాయింటికి వచ్చెనని తలంచుచున్నాను. అని వారిని సాదరముగా నింటిలోనికిఁ గొంపోయి ఉష్ణోదకములతో స్నానమాడించి, పీటపైఁ గూర్చుండఁబెట్టి, పత్నీసహితుఁడై పూజించి, ఫలములను, క్షీరములను దెచ్చి, వారిముందుంచి, భుజింపఁ బ్రార్థించెను.

భక్తిగౌరవములతో దమ కాయింటివారు చేయుచున్న సపర్యల వారు వలదనఁజాలక, ఫలాదులఁజేకొని, వారికానందమును సమకూర్చి, ఆరాత్రి యట శయనించి, తెల్లవారకమున్నే మహాకాళమునకు వెడలిపోయిరి.

---

# పంచమాశ్వాసము.



## శివసందర్శనము.

భారతదేశమున జగదీశ్వరాలయములలో జరుగుదివ్యోత్సవములు కలుషహారములు; సందర్శనీయములు; జ్ఞానప్రదములు. వివేకనిధులగు సార్వభౌములును, విజ్ఞానకలితులగు శ్రీమంతులును, దేవాలయ నిర్మాణమునకై వెచ్చించిన విత్తమునకును, వారు చెందిన శ్రమకును, మేర లేదు. ఆసేతు హిమాలయము వఱకు భారతదేశమంతటను మహోన్నతశిల్ప సుందరములును మనోహర సుమవాటికా శోభితములు నగు, దేవతామందిరములసంఖ్యేయములుగా విరాజిల్లుచున్నవి. భక్తు లాయాతావులకేఁగి, దేవాలయగోపుర శిల్పనైపుణ్యములఁ దిలకించునపుడును, లోనికేఁగి యచటి పుస్తకభాండాగారముల నవలోకించునపుడును, ఆలయాంతరమున జరుగు దివ్యవిగ్రహ వైభవముల సందర్శించునపుడును, ఆనందకందళిత హృదయు లగుచుందురు.

అట్టి దేవాలయములలో మహాకాళక్షేత్రముననున్న శివాలయము మొట్టమొదట నెన్నఁదగి యున్నది. ఇందు దశార్ణవదేశమున వెలసియున్న ద్వాదశ జ్యోతిర్లింగములలోఁ గాలేశ్వరలింగము ప్రతిష్ఠింపఁబడియున్నది. ఉజ్జయినీ సార్వభౌములు యీశివలింగమును అమితప్రపత్తితో నారాధింతురు. ఈశ

వశము నిత్యోత్సవములతో నిండి, సందర్శనీయమై యలరారు చుండును. మఱియు, శివరాత్రినాఁడు అవంతీపురాధిపతు లిట సాగించు మహోత్సవములను, శ్రీమంతులగు భక్తసంఘము లొనరించు పూజలను, జూచి తీరవలయును. ఆనాఁ డీక్షేత్రము ప్రమథగణ పరివృతమైన కైలాసపురమువలె యాత్రిక సంఘములతో నిండి నిబిడీకృతమై కన్నుల పండువుగాఁ జూపట్టు చుండును.

పావనదివసమగు మహాశివరాత్రినాఁటి యుదయమున శ్రావణుఁడు తలిదండ్రులతో ఆపుణ్యక్షేత్రమున కేఁగి సిప్రానదీ జలముల స్నానమాడి, శివాలయములోనికిఁ బితరులఁ దోడ్కొని వెళ్ళి, అచటి మహాత్మ్యములనుఁగూర్చి వారికిఁ దెలుపుచు, ఆనాఁడు తెల్లవారువఱకు నిరాహారముగా దేవాలయముననే నివసించి మఱునాఁ డుదయమున స్నానసంధ్యాదులఁ దీర్చి, ఉపవసించియున్న తలిదండ్రులకు వేగిర మోగిరము సమకూర్చి, వారిని ముందు భుజింపఁజేసి, అనంతరము తా నారగించెను.

వా రాపుణ్యక్షేత్రమున మూఁడురాత్రులుండి, ఫాల్గున శుద్ధ పాడ్యమినాఁటి రాత్రి తృతీయయామమున ఆక్షేత్రమును వదలి, జ్యోతిష్మతీపురమునకుఁ బోవుచుండ, భాస్కరుఁడు నభోమధ్యమునకు రాఁదొడంగెను. శ్రావణుఁడు దానింగాంచి వేగముగా నొకజలాశయము సమీపించి, ఆతటాక

తటముననున్న వటచ్ఛాయను పితరుల దింపి, వంటచేయుటకుఁ గట్టియల నేరుచుండెను.

అపుడు కడుపుతోనున్న లేడియొకటి వడివడిగవచ్చి కావడిలోనున్న యావృద్ధదంపతుల నడుమఁ జేరి, యొడలు ముడిచికొని, గడగడ వణఁకఁజొచ్చెను. శ్రావణుఁడాభీతహరిణీస్థితిని గాంచి, జాలిఁజెంది, ఆలేడికిటు బెదురునకుఁ గారణ మేమైయుండునా యని నలువైపులఁ బరికింప, దన కనతిదూరమున నెక్కుపెట్టిన వింటిబద్ద నొకచేతను, ఆసింగాణినిఁ దొడుగుటకుఁ దూణీరమునుండి తీసిన వాఁడికోలను వేఱొకకరమునను బట్టికొని, హంతకునివలె తనచెంతకు వచ్చుచున్న వేటగాఁడు గానవచ్చెను.

శ్రావణుఁడామృగయునిఁ గాంచి, లేడిభయమునకు వానిరాకయే కారణమని తలంచుచుండ ఆవ్యాధుఁడు జింకకై యటునిటుఁ బరికించుచు వటముకడకు వచ్చి, వృద్ధదంపతుల మధ్యమున నక్కియున్న లేడినిఁజూచి, ధనువున శరమును సంధింపఁబోవుచుండ శ్రావణుఁడాతనిచేతిని బట్టికొని యిట్లు ప్రశ్నించెను.

శ్రావణుఁడు:—సోదరా! నీబాణ సంధాన ప్రయత్నమునకు నే నడ్డు వచ్చినందుకు క్షమింపుము. అన్నా! పాపమీ వెఱ్ఱిబాగులయిఱ్ఱి నేలవధింపఁ దలంచితివి? ఈహరిణకాంత, కాంతారాంతర తృణములఁ దినుచు, సెలయేటి నీటినిఁ ద్రాగు

చు, నొరులకుఁ గీడుసేయక, సంచరించు సాధుజంతువుకాని ప్రాణుల భక్షించు క్రూరసత్వము కాదుకదా? కావున నాప్రార్థనమును మన్నించి, యీసారంగి ప్రాణములఁ గాపాడుము.

వ్యాధుఁడు:—మునికుమారా! ఇది మీపెంపుడు లేడియా?

శ్రావణుఁడు:—సోదరా! ఇది మేము మచ్చికచేసిన జింకకాదు. అడవిలేడియే.

వ్యాధుఁడు:—అట్లగుచో దీనిం జంపకుండ నన్నేల నివారించెదవు? విడువుము నాచేతిని. పొద్దుటనుండి, యీనడిపగటివఱకు నడవియంతయు గ్రుమ్మరితిని. కాని, యొక్క మృగమైనఁ గానరాదాయె. ఇప్పటికీలేడియొక్కటి భాగ్యవశమున దృగ్గోచరమైనది. దీనింగొట్టక విడిచిపెట్టినచో నాపొట్ట గడచుట యెట్లు?

శ్రావణుఁడు:—వ్యాధోత్తమా! నిరపరాధములగు మృగయూథముల వధింప నీకీయధికార మెవరొసంగిరి?

వ్యాధుఁడు:—తాపసకుమారా! నన్ను నివారింప నీకీయుద్యోగ మెవరిచ్చిరి?

శ్రావణుఁడు:—దయాస్వరూపుఁడగు భగవానుఁడు. ఆప్రభువుని యహింసా శాసనానుసారము నిన్ను నివారించుచుంటిని.

వ్యాధుఁడు:—ఓయీ! నా కీయధికారమును గూడ ఆసర్వేశ్వరుఁ డొసంగినదియే. విపినసత్వములు మృగయుల సొత్తులు. అందుచే వారు వానిం జంపి, సుఖింపవచ్చును. అహింసావ్రత మవలంబించుటకు మేము శమధనులమగు మునితనయులము కాము. వన్యమృగమారణ జీవనులమగు కిరాతజాతి వారము.

శ్రావణుఁడు:—అన్నా! ఎన్నియో జీవనోపాధులుండ, యీక్రూర కిరాతవృత్తి కేల పాల్పడితివి? సోదరా! వలదువలదు ఈచూలాలిని జంపవలదు. చూడు మా లేడియ జాలిగొలుపు చూపులను! ఆమృగి దీనావలోకనములలో నీయలుగెక్కడ తనకడుపులోనున్న చిన్నికూనను జంపునోయను భయము వ్యక్తమగుచున్నది. కావున మాయన్నా! నా వేడుకోలు నాలించి, యీసారంగి తాఁ గన్నబిడ్డను గన్నులారఁ గాంచి పాలిచ్చి, ఆనందించు భాగ్యమును బ్రసాదింపుము.

వ్యాధుఁడు:—మునినందనా! ఈలేడియ నీయది కాదంటివే! నీ కేల దీనిసంరక్షణప్రయాసము?

శ్రావణుఁడు:— ఆపన్నులఁ గాపాడుట ఆర్యకుమారులకు ముఖ్యధర్మము. ఈజింకె నాతలిదండ్రుల నడుమఁ జేరి, తన్ను రక్షింపుడని నిజదీనావలోకనములచేఁ దెలియఁజేయుచున్నది. కట్టా! దాని దైన్యమును గాంచిన రాలుకూడ కరుగునే. నీహృదయము ద్రవించుట లేదా?

వ్యాధుఁడు:—ఈనాఁడు నేదీనిం జంపి, తీసికొని పోవకున్న, నాయాలుబిడ్డలు జీవించుట యెట్లు? వారి యాఁకటి బాధను దలంప నాగుండె నీరగుచున్నది. కాని, దీనిం జూచుటచే కాదు. విడువ్రము నాచేతిని.

శ్రావణుఁడు:—సోదరా! దీని మాంసముతో నీకుటుంబమువారు జీవింతురా? లేక దీనిని విక్రయించి, ఆమూల్యముతో సుఖింతురా?

వ్యాధుఁడు:—ఆర్యా! దీనిని వధించి, పట్టణమునకుఁగొంపోయి, భాగ్యశాలురకు విక్రయించి, ఆసొమ్ముతో జీవింతుము.

శ్రావణుఁడు:—అటులనా? దీనిని విక్రయించిన నీకెంత పైకము చేకూరును?

వ్యాధుఁడు:—నాలుగు వరాలు రొక్కము దొరకవచ్చును.

శ్రావణుఁడు:—అట్లగుచో, నేనావెల యిచ్చిన నీవీజింకను జంపక, త్యజింతువా?

వ్యాధుఁడు:—సందేహమేమి? అమితానందముతో నీవేడినివిడచి, నీపదములకు వందనమొనర్తును. కాని యిపుడంతటి సొమ్మిచ్చు బేరగాండ్రడే? నీవా! కాషాయపు గుడ్డలతో నున్న బీదతపసి కొమరుఁడవుగాఁ జూపట్టుచున్నావు. కాని, చోరభయముచే ఆతట్టలలో నేమైన సొత్తును గుట్టుగా దాచి పెట్టితివా ఏమి?

శ్రావణుఁడు—సోదరా! ఆతట్టలలో భద్రముగానుంచినది సామాన్యధనముకాదు. అది పూర్వజన్మార్జిత పుణ్యసా

ఘ్యమగు అమూల్యభాగ్యము కాని నీవుకోరు రొక్కము కాదు. అని నడుమునఁ జుట్టియున్న శాటీపటమును విప్పి, అందు మును దొంగలొసంగిన సొమ్ములోనుండి నాల్గువరాలు తీసి వేఁటకాని కొసంగెను.

వ్యాధుఁడు ఆకృపానిధి జీవకారుణ్యమునకు వింతచెంది, నిజనింద్య జీవనమునకు లజ్జితుఁడై, యిట్లు చింతించెను. "ఓహో! ఏమి! యీదయామయుని కరుణారస ప్రవాహము! ఇస్సీ! ఏమి నా ఆయస మానస వికారము. ఈముని తనయుని హృదయము, ఈసారంగినిఁ జూచినతోడనే, సంరక్షింపఁ ద్వరపడినది. ఇఁక నామానసమో, దీనిం గాంచినతోడనే వధింప వేగిరపడినది. ఇఁకముందు నే నీదయా విరహితమగు కిరాతవృత్తిచే జీవించుట యర్హముకాదు. ఈనాఁడు ఈవటు చంద్ర సందర్శనముచే, నాయజ్ఞానము పటాపంచలైనది." అని శ్రావణుని పాదములకు వందనమొనర్చి, వెడలిపోయెను.

శ్రావణుఁడు మృగయుఁ డేఁగిన పిదప లేడి నిర్భయముగా నుండుటను గాంచి, సంతసమంది అన్నమును వండి గంజి వార్చి, ఆవార్పు చల్లారినతోడనే లేడికిఁ ద్రాగఁబెట్టెను. సారంగి యా యమృతాహారసమును ద్రాగి, యథేచ్ఛగాఁ బరుగిడెను. పిమ్మట నాతఁడు పితరులకు భోజనమిడి, యనంతరము తానారగించి, తలిదండ్రులతో దివ్యస్థలములఁ గూర్చి చర్చింపఁ దొడఁగెను.

---

# షష్ఠాశ్వాసము.

## ఇందిరానురాగము.

ఒకనాఁటి ప్రభాత సమయమునఁ బద్మినీకాంత కమల బాంధవుని రాకను గాంచి, వికసిత వదనారవిందయై నిజామోద మును వెల్లడించుచుండ, మొగలిచెట్టునుండి లేతపుప్పొడివలెఁ దూర్పుతట్టునుండి లేయెండ బయల్పడుచుండ శ్రావణుఁడు బుజ ముపైఁ గావడినిడికొని, చేత నాతపత్రిమునుధరియించి, పావన ములగు శివలీలల మనోహరముగా గానమొనర్చుచు, జ్యోతి ష్మతీపుర రాజవీథిని రాఁదొడంగెను.

తెల్లవారుజాముననే లేచి, యరుణోదయ మగువఱకు వీణాభ్యాసము చేసి యపుడె వీణియను ముగించిన ఇందిర యను పేరుగల దక్షిణకోసలనృపాలపుత్రిక శ్రవణసుఖదమగు శ్రావణ మోహాన గానము చెవిసోకినతోడనే సౌధాంతరమునుండి మేడ పైకివచ్చి, రాజమార్గమున బాలభాస్కరునిమాడ్కి తేజరిల్లు చు వచ్చుచున్న యా మునినందనునిఁ గాంచి, చెంతనున్న చెలి కత్తియతో నిట్లు ముచ్చటించెను.

ఇందిర:—పద్మా! ఆవచ్చుచున్న సుందరాంగుని యంద మును జూడుము! మందస్మిత సుందరమై, ఆకర్ణాయత నేత్రశోభి తమై, శాంతపావన కళాసనాథమై, వెలయుచున్న యీ మహి

తాత్మ్నని వదనసరోజమును జూచినతోడనే నాయంతరంగము కన్యకాభావముపై విరాగమును జూపుచున్నది. సర్వేంద్రియ వ్యాపారములును కంటఁబడి యీసొగసుగాని వెంటఁ బోవు చున్నవి.

నెచ్చెలీ! ఒకశాటినిఁ గట్టి వేఱొకశాటిని మొలకుఁజుట్టి కరకలితాతపత్ర దండముతోఁ జూపట్టు ఈమునికుమారుని పావ నాకారమును గాంచునపుడు, బలినర్థింప నేఁగుచున్న వామనుఁ డా! యనియు, భుజమస్తక న్యస్త వంశ కాండముతోఁ గన్పట్టు ఈనవయవ్వనుని మోహనాకారమును దిలకించునపుడు, హ రుని నిర్జింప నరుగుచున్న మరుఁడా! యనియు, సంశయ ముదయించుచున్నది. ఆసృష్టికర్తయెంత కాలమునకుఁ బురుష నిర్మాణములోఁ దన నేర్పరితనమును బ్రకటింపఁ గలిగె!

పద్మ:—రాజకుమారీ! నీవు తలంచినట్లు ఈమునికు మారుని సోయగము లోకమోహన మనుటకు సందియము లేదు. ఈతఁ డేకులమువాఁడో తెలియ రాకున్నను, చూచి నతోడనే చేతులెత్తి నమస్కరింపవలయు ననుతలఁపు మొల కెత్తుచున్నది.

ఇందిర:—సఖీ! ఈసౌమ్య సుందరరూపుని గాంచిన తోడనే, నాడెందమున నేదియో తెలియరాని స్మృతి స్ఫురి తమై, తిరుగఁ దిరోహితమైనది. చిరసంగతుఁడగు మిత్రుని గాంచినట్లు నామానస సరోవరమునందలి అనురాగారవిందము కుళము, వికసింప మొదలిడినది. ఇందుకుఁ గారణమేమందువు

పద్మ:—సఖీ! పూర్వ జన్మానురాగములు స్త్రీపురుషులకుఁ దెలియరాని సంతోష పరితాపముల జనింపఁ జేయుచుండును. కావున మీ రుభయులును పూర్వభవమునఁ బ్రేమబద్ధులగు జంటలై యుండనోపుదురు.

ఇందిర:—సఖీ! నీ వీమహానీయుని వెంట నేగి, ఈభాగ్యశాలి చరితమునంతయు నిపుణముగఁ దెలిసికొనిరమ్ము. నీవు వచ్చువఱకు నే నిచ్చటనే నిలచియుందును. జాగుసేసి, నను బరితాపములఁ బాలుసేయకుము. అనఁ బద్మ, శ్రావణుని వెంట వెడలిపోయెను.

శ్రావణుఁ డుదయ మూఁడుగంట లగునరికిఁ దలిదండ్రుల నొక ధర్మసత్రమునకుఁ గొంపోయి, అందుఁ బక్క వేసి దానిపై వారలఁ బరుండఁబెట్టి, మెల్లగా వారిపాదముల నొత్త మొదలిడెను. ఇంతలో ఇందిరచేఁ బంపఁబడిన పద్మయు వారిచెంతకేతెంచి నిలచెను. అపు డాసతీపతిసుతుల కిట్లు ప్రసంగము నడచెను.

విశ్వనాథ:—కుమారా! నేఁడేలనో! నాకు మనోవ్యాకుల ముదయించుచున్నది! మా కీయంధతా దారిద్ర్యములే కాక మఱెట్టి దుఃఖము రానున్నదో! తెలియకున్నది. కర్మగతు లగమ్యములు. భగవంతుఁ డీపాటికైన మాజీవితముల ముగింపఁ జేయరాదా? ఇట్లెంత కాలము నీసౌఖ్యము నరికట్టి, నీచే దాస్యము చేయించుకొందుము? శ్రావణుఁ డావిరక్తి సూక్తుల నాలించి బెగడొంది, యిట్లు పలికెను.

శ్రావణుఁడు:—ప్రియజనకా! ఏల యీలీల మాట లాడుచుంటిరి? దీర్ఘప్రయాణ మొనర్చుటలో మీకుఁ గావడి కుదు పధిక మాయెనా? లేక, తెల్లవారుజామున నే పయన మగుటచేఁ జలిగా లెక్కువగా సోకెనా? అదికాక నాయుపచా రమున నపచార మేదియేని కానవయ్యెనా? తండ్రీ! మీవ్యా కులమునకుఁ గారణమును విని దాని నుపశమింపఁ జేయువఱకు నాకు శాంతి చేకూర నేరదు.

విశ్వ:—పితృసేవా దురంధరా! ఏదియో తెలియరా ని యాపద సమీపించుచున్నట్లు నామానసము భయ మందు చున్నది. కుదుపుకాని, చలికాని,యిందుకుఁ గారణములు కావు. ఇఁక నీయుపచారమున నపచారముదయించుటయుఁ, జంద్రకాం తిలో దావ ముద్భవించుటయు, నసంభవము. కావున, వృథా గా బెంగటిల్లవలదు.

అన్నపూర్ణ:—మృదుహృదయా! తనయా! నీయుల్ల మునఁ దప్పును, గంగాతోయమున నుప్పునుఁ జూడనగునా? దూరమునుండి జలమున నక్షత్రములు ప్రతిబింబించునట్లు మాన సమునఁ గర్మఫలములు స్ఫురించుచుండును. ముందేమి రాను న్నదో యెవ్వ రెఱుంగుదురు? కాల మొక్కరీతిని గడువఁబోదు కదా?

పుత్రరత్నమా! మావలన నీకెంతవంత కలుగుచున్నను సంతసమునే వెల్లడింతువుకాని, ఆవంతయుఁ జింతను బ్రకటింప వు. మాయన్నా! మే మాత్మూమకాలమున నీకుపనయన మొన

ర్చి, బ్రహ్మచారినిగాఁ జేసితిమే కాని, పరిణయ మాచరించి, సంసారినిగాఁ జేయఁ జాలమైతిమి. దారిద్ర్య సామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిగా నొనరించితిమే కాని, సంపన్నునిగా నొనర్ప లేమైతిమి. ఇప్పటికిని నీవు సౌఖ్యముగా జీవింప వీలువకుంటిమి.

శ్రావణ:—తల్లీ! గంగా జలావగాహనముచేఁ బాపమును, పితృపద నీరజసేవచేఁ బరితాపమును కలుగునా? జననీజనకులారా! మీా రెందులకో యీనాఁడు నాతో ననన్యాపదేశముగా మాటలాడుచున్నారు. భయము శరీరాభిమానులకుఁగాని విదితాత్ములకుఁ గలుగఁబోను. నిరతాన్న ప్రదాతలై తేజరిల్లిన నాపితరులకు దయామయుఁడగు భగవానుఁడు ఆనందమును సమకూర్చునుగాని ఆపదల నొదవింపఁడు. కావున మీారు శాంతాత్ములుగా నుండవలయును. ఇదే ప్రొద్దెక్కకుండ వంటచేసి వడ్డింతునని, వారి నట విడచి కావడిలోనుండి, పాక పాత్రముల దీయుచుండెను.

పద్మ వారి ప్రసంగముల విని, తిరుగ నిందిర మందిరమున కేఁగ, ఆపె పద్మను గాంచి యిట్లు ప్రశ్నించెను.

ఇందిర:—పద్మా! ఆసుధాకర వదనుని చరితమును సాకల్యముగాఁ దెలిసికొంటివా? అసాగసుకాఁడు మన పట్టణమును వదలి పోలేదుకదా?

పద్మ:—రాజకుమారీ! లేదు. వా రొకసత్రమున దిగియున్నారు. విను మామునికుమారుని జీవకళా కలిత

మగు చరితమును. కావడిలోనున్న వృద్ధులాపిన్నవాని పితరులు, అంధులు, కడుదరిద్రులు. ఆయువకుఁడు పితృసేవాపరాయణుఁడగు బ్రహ్మచారి. ప్రియసఖి! ఏమి! యీ మునితనయుని మాటలయందలి పొందిక! చూపులయందలి పావనత! ఓహో! ఆసచ్చరితుఁడు తనప్రక్క నిలచియున్న నావైపు కన్నెత్తి చూడనే లేదు. ఆఘనహృదయునిఁ జేపట్టుటకు సామాన్య సంపదలు చాలవు. పూర్వార్జిత సుకృత వైభవములు మెండుగానుండ వలయును.

ఇందిర:—చెలీ! ఆసుశీలుఁడు బ్రహ్మచారియని యెట్లు తెలిసికొంటివి? త్వరపడి యడిగితివా యేమి?

పద్మ:—నాకుఁ దత్వరయెందులకుఁ గలుగును? అది నీ కుదయింపవలెను. అద్వితీయమగు యజ్ఞసూత్రమును, అసదృశమగు వటుతేజమును బరికింప నాతఁడు వర్ణియని నిర్ణయింపవచ్చును.

ఇందిర:—ఆయందగాని కిదివఱకు నెవతియైన పుణ్యవతి సతిగా నిశ్చితయై యున్నదేమో?

పద్మ:—ప్రియసఖి! భీతిల్లకుము. ఆమోహనాంగునకింతవఱకుఁ గాంతగా నేకన్యయు నిశ్చితకాలేదు. కాని, దైవసంకల్పమున్న ఈనా డట్టి నిర్ణయము కావచ్చును.

ఇందిర:—ఆయిందువదనునకుఁ గళత్రముగా నేసుందరియు నిశ్చిత కాలేదని నీవెట్లు తెలిసికొంటివి?

పద్మ:—ఆబ్రహ్మచారికిని, ఆతని తలిదండ్రులకును నడచిన ప్రసంగమువలన.

ఇందిర:—ప్రియసఖి! నిజము దాపనేల? నామానస మీతనిఁ బతినిగాఁ బడయ నభిలషించుచున్నది. ఇందులకు నీ వేమందువు ?

పద్మ:—శీలసౌందర్యమునే స్వయంవరమునకు ప్రధాన భాగ్యముగా నెంచు కన్యకలు తప్పక యిట్టివారినే చేపట్టఁ గోరుదురు.

ఇందిర:—నిజము. గుణహీనులగు సంపన్నులకంటె ధనవిరహితులగు గుణవంతులే వరణార్హులు.

పద్మ:—కాని, నృపకుమారీ! నీ యభిలాషకు నీతలిదండ్రులు అనుకూలు రగుదురో! లేదో! యని సంశయించుచున్నాను.

ఇందిర:—మన కీసంశయ మెందులకు. రమ్ము ముందు మాతల్లికడ కేఁగి, నాసంకల్పము నెఱిగింతము. అని ఇందిర పద్మతోఁ దల్లికడ కేఁగి నమస్కరింప ఆరాజకాంత "కళ్యాణ పరంపరావాప్తి రస్తు" అని దీవించి, ఇందిరను పర్యంకముపైఁ దన ప్రక్కఁ గూర్చుండఁబెట్టుకొని యిట్లు పలికెను.

తల్లి:—అమ్మా ! ఇందిరా ! నీవు రాజపుత్త్రులఁ బరిగ్రహింప నిరాకరించుచుండుటచే, నీతలిదండ్రులమగు మాకుఁ జాల ఖేదముగా నున్నయది. పుత్త్రి ! నీవు సకలధర్మముల బా

గుగా నెఱింగిన విదుషీలలామవుకాని, చదువురాని సామా న్య కన్యవుకావు. ఇట్లు కులకన్యలు అవివాహితలై పుట్టినింటనే యుండఁదగునా ? లోకులు వారిజీవితములఁ గూర్చి కింవ దంతులు పుట్టింపరా?

ఇందిర:—తల్లీ ! మీ కీయపవాదమును దొలగింపఁ బ్రయత్నించుచున్నేయుంటిని. కాని, దైవ మింతవఱకు నాసంకల్పమునకు అనుకూలుఁడు కాఁడాయె. నేఁ డీసుదివసమున భగవానుఁడు నాకు వల్లభుఁడు కాదగిన పుణ్యాత్ముని బ్రత్యక్షము చేసినాడు. నే నాసంతోషవార్తను నీకెఱిఁగింప వచ్చితిని.

తల్లి:—పుత్త్రి ! మా కెన్నాళ్ళకు నిన్ను గన్యాదానము సేయు భాగ్యము సమకూరినది! అమ్మా ! ఆతఁ డేదేశ నృపాలసూనుఁడు ?

ఇందిర:—పద్మా ! అమ్మగారి కొసచ్చరితుని వృత్తాంతమును విన్నవింపుము. అనఁ బద్మ శ్రావణచరితము నారాణికి వివరించెను. ఆమునికుమారజీవితమును విని, ఆరాణి ఇందిరతో నిట్లు పలికెను.

తల్లి:—అమ్మా ! చక్రవర్తిపుత్త్రినిఁ జేఁబట్టఁ దగిన నీవు నిఱుపేదను బ్రేమించుట తగునమ్మా ! నీయభిలాషకు, మహారాజు అంగీకరించునటమ్మా !

ఇందిర:—మాతరో ! మీ రంగీకరింపకున్న, నాకన్యాత్వ మెట్లుతొలంగును? తల్లీ ! నిజ మెఱింగింతు నాకర్ణింపుము.

ఆమునితనయునితో నే మానసికపరిణయము చేసికొంటిని. ఇఁక నాతఁడు నాగళమున మంగళసూత్రముఁ గట్టుట మిగిలియున్నది. జననీ! ఇదే నీపాదములఁబట్టి, ప్రార్థించుచున్నదానను. నీ వీయిందిరయందుఁ గనికరముంచి, మహారాజునకు నచ్చచెప్పి నామనోరథ మీడేర్పుము. అని తల్లిపాదములపైఁ బడి, విలపింపఁ దొడంగెను.

ఆరాజపత్ని పుత్త్రికావాత్సల్య వశంవదయై, ఇందిర నోదార్చి, పతికడ కేఁగి తమసుత సంకల్పమును తెలిపెను. మయూరుఁడు పుత్త్రిక మనోరథమును దీర్పఁగోరి మంత్రులఁ బంపి, యామునికుమారుని దన మందిరమునకు రప్పించి, యిట్లు ప్రశ్నించెను.

మయూరుఁడు:—తాపసనందనా! మీ దేదేశము? కులమెయ్యది? ఇటకు రాఁ గారణమేమి?

శ్రావణుఁడు:—మహారాజా! వందనములు. మాది శూరసేనదేశము. మేము వైశ్యులము. పుణ్యతీర్థముల సేవింప నేఁగుచు, మార్గవశమున నిటకు వచ్చితిమి. రా జామాటలు విని, దిగులొంది, యిందిరకడ కేఁగి, యిట్లు బోధించెను.

మయూర:—అమ్మా! ఇందిరా! ఆమునిసుతుఁడు బేరికొమరుఁడు కాని, రాజనందనుఁడు కాఁడు. నీ వీసంగతి నెఱుంగక, యాతనిసంగతి నపేక్షించితివి. లేకున్న క్షత్రియ

పుత్త్రిక వైశ్యబాలుని వరించునా ? కావున నీ వీప్రయత్నము నుండి విరమింపుము.

ఇందిర:—ప్రియజనకా ! శాంతముతో నావిజ్ఞాపనము సాంతముగా నాలింపఁ గోరుచున్నాను. తండ్రీ ! నేఁ బ్రేమించి నది శరీరము కాదు. శరీరాంతర్గతమగునాత్మ. కులము, దేహము నకే కాని, దేహికి లేదు. మఱియు న న్నీప్రయత్నమున స్థిర చిత్తనుగాఁ జేసినవి అమునికుమారుని దేహసౌందర్య సంప దలు కావు. ఆసాధునందనునందలి సుగుణసుమసౌరభము లే. కావున నన్ను గేవల కాముకురాలనుగాఁ దలంపక, ప్రపన్ను రాలినిగా భావించి ఆసుచరితునకు నన్నొసంగి, నాయభీష్టము నీడేర్పుడు. నే నామునిబాలునిఁ దక్క యన్యునిఁ బరిగ్రహిం పను.

మయూరుఁడు తనకొమరిత కోరిక నాలించి, మంత్రుల తోఁ గర్తవ్యముంగూర్చి యోజింప, ధీమంతులగు నామంత్రులు, తమ యేలిక కిట్లు నివేదించిరి.

మంత్రులు:—మహారాజా ! ఈమునిసుతుఁ డెవ్వఁడో శాపవశమున భూలోకమున జన్మించిన అమరకుమారుఁడై యుండనోపును కాని, మర్త్యనందనుఁడై యుండఁడు. ఈతని ముఖవిలాసము దీనిని వెల్లడిచేయుచున్నది. కోసలసార్వభౌమా! ఈయిందిర యేలినవారి కేకపుత్త్రిక; అసమాన వివేకధుర్య. ఈమె యీ మునితనయునే కాని, యన్యులఁ బరిగ్రహింపనొల్ల

కున్నది. కనుక యీబ్రహ్మచారికిఁ దమపుత్త్రిక, నొసంగి, మీయనంతర మీకోసలరాజ్యమును గూడ నందఁజేయుడు. దాన సర్వమును శుభప్రదమగును. మయూరుఁడాహితబోధల నాలించి, ముఖ్యసచివునితో శ్రావణుని తలంపెట్టున్నదియో తెలిసికొనుమని తెలిపెను. రాజాజ్ఞానుసార మాయమాత్యుఁడు శ్రావణుని వేఱొక మందిరములోనికిఁ దోడ్కొనివెళ్ళి, యిట్లు ప్రబోధించెను.

# సప్తమాశ్వాసము.

హి త బో ధ.

అమాత్యుఁడు:—మునికుమారా! మామహారాజు నీకుఁ దనపుత్త్రిక నిచ్చి, వివాహము సేయ నిశ్చయించెను. ఆకన్యయు నిన్నుఁ బ్రేమించియున్నది. ఆయువతీమణి గుణవతి, సకలకలాభిజ్ఞ. కావునఁ బాణిగ్రహణమునకు సంసిద్ధుఁడవు కమ్ము.

శ్రావణుఁడు:—సచివోత్తమా! నన్నిట్లు గేలిసేయుట న్యాయమా? నే నేడ? చక్రవర్తి పుత్త్రిక యేడ! నన్నంతటి దురాశాపాతకునిగాఁ దలంపవలదు.

అమాత్య:—తాపసనందనా! నేను నీబోటి సాధుకుమారులఁ బరిహసించు నంతటి కుమతిని కాను. నేఁ దెలుపుచున్నది నిక్కమగు వాక్కు కాని, దబ్బరయగు పలుకు కాదు.

శ్రావణుఁడు:—ఆర్యా! నాతప్పును క్షమింపుడు. నే నా రాకన్నియఁ జేపట్ట నెంతమాత్ర మర్హుఁడను కాను.

అమాత్య:—వెఱ్ఱివాఁడా! ఇదేమివింత! అప్రయత్నముగా సంప్రాప్తమగుచున్న, గుణవంతమగు కన్యారత్నమును, ముందు సంప్రాప్తము కానున్న సుభోజ్యమగు రాజ్యమును వలదని, చేతులారఁ ద్రోసి పుచ్చుచుంటివి. వ్యాకులచిత్తుఁడవై వేగిరపడక శాంతాత్ముఁడవై బాగుగ యోజించుకొనుము. తమ్ముఁడా! ఇట్టి సంపదలు మించఁబెట్టుకొన్న మఱి చేకూరునవి కావు.

శ్రావణుఁడు:—అమాత్యశేఖరా! బాగుగ నాలోచించియే పలుకుచున్నవాఁడను. నేను, రాజపుత్త్రీకరగ్రహణమునకుఁ గాని, రాజ్య నిర్వహణమునకుఁ గాని, యెంతమాత్రము నర్హుఁడను కాను. నాయందుఁ బుత్త్రవాత్సల్యముంచి, నన్నీకాంతాకనక వ్యామోహ సాగరమునఁ బడకుండఁ గాపాడుడు.

అమాత్య:—వణిఙ్నందనా! ధనమునకు సాధ్యముకానిది యిహపరముల నేదియు లేదు. నీవు నీతలిదండ్రుల సంతసింపఁ జేయుటకును, ఘనానందముతోఁ గాపురము సాగించుటకును, బీదలఁ గాపాడుటకును, విత్తమే యుత్తమ సాధనము. కావున ననాలోచితముగ భాగ్యముల నిరాకరింపక నృపకుమారీ పాణిపల్లవమును బరిగ్రహింపుము.

శ్రావణుఁడు.—ఆర్యా! ధనప్రభావము నే నెఱుంగుదును. అది పుత్త్రుని శత్రువునిగను, జనకుని జమునిగను, తల్లిని మిత్తిగను ఇట్లే యాప్తబృందముల నరిసంఘములనుగను ప్రత్యక్షము సేయును. మానవుఁడు సామాన్యముగా సన్మార్గమునుండి జారిపోవుటకు ముఖ్యసాధనము ధనమే. దీని బారినిఁ బడి మహర్షులే తబ్బిబ్బైరి. నాయట్టి వేఱెమాట చెప్పనేల?

అమాత్య:—ఓయమమాయకుఁడా! సోదరుఁడా! పోనీ, నీవన్నట్లు ధనము దుష్టమందము. కాని నిన్ను వలచియున్న

రాకన్నె యట్టిదికాదే? మీకామె దాసివలె సేవలఁజేయ నెంచు నేకాని రాజసముచే మీపై నీరసభావము చూపఁగోరదే! అట్టి గుణవతియగు యువతినిఁ బరిగ్రహించుటకు అభ్యాంతరమేమి?

శ్రావణుఁడు:—కవివరేణ్యా! నిజమే. మీరన్న ట్లానృపకుమారి సుశీలయే కావచ్చును. కాని దరిద్రపుత్రుఁడనగు నాకును, చక్రవర్తి తనూభవయగు నామెకును, కలయికయెట్లు పొసఁగును? పల్వల పంకమునకును, పయోద సౌదామినికిని సామానాధికరణ్యము సరిపడునా? కావున మహాశయా! నన్నీపరిణయ ప్రహసనమునకు నాయకునిగాఁ జేయకుఁడు. మీ యుపదేశములకు వ్యతిరేకముగాఁ బలుకుచున్నందులకు క్షమింపుఁడు. ఇవె నా నమస్కారములఁ జేకొనుఁడు.

అమాత్యుఁడాతని సంభాషణములకు వింతచెంది యిట్లు ప్రశంసించెను.

అమాత్య:—సాధు! కుమారా! సాధు! త్యాగకళయొక్క నిజమగు కాంతినిఁ గాంచవలయునన్న అద్దాని నద్దమునందువలె నీసుద్గుణములయందేఁ జూడనగును. బాపురే! ఓ వైశ్యకులాలంకారా! అప్రయత్నముగ సంప్రాప్తము కానున్న నిస్తుల రాజ్యసంపదను, అవ్యాజానురాగముతో నిన్ను బరిణయమాడఁ గోరుచున్న సార్వభౌమపుత్రికను, పితృసేవాపరాయణతచేఁ బరిత్యజించుచుంటివి!

ఈజగతీతలమున జనులు ధనాశచే నీచకార్యముల నెన్నెన్నోఁ జేయుచుండ నీ వాత్మగౌరవాదరముచేఁ గాంతా కాంచనములఁ దృణీకరించుచుంటివి ! నీయట్టి పుత్త్రరత్న మొక్కఁడు చాలఁడా జన్మభూమినిఁ గీర్తివంతమునుగాఁ జేయుటకు! సెబాసు! ఈ కటిక పేదరికమున; యీనవయౌవన వయఃకాలమున; ఈయనాయాస లాభసమయమున రాసికిఁగాని రాకొమరికిఁగాని నీమదినిఁ దావొసంగకుంటివి! నీ వింతటిగుణవంతుఁడ వగుటనే మేధానిధియగు మాతేనిపట్టి నిన్నుఁ జేఁబట్టనున్నది. మునికుమారా! త్యాగవీరుఁడవై చిరకాలము జీవింపుము. నాకు సెలవొసంగుము. పోయివత్తును. అని అమాత్యుఁ డాతని విడిచి మహారాజు కడకేఁగి, శ్రావణుని మనోనిశ్చయమును విన్నవించెను.

అంత నాయేలిక ఇందిర మందిరమున కేగి, ఆమెతో నిట్లు పలికెను. "అమ్మా! ఇందిరా! మనమంత్రి ఎంతబోధించినను ఆతాపస కుమారుఁడు నిను బరిగ్రహింప నంగీకరింపడాయె? వివాహ మన్యోన్యానురాగ సంపన్నమై యుండవలయును. అట్లుకాకున్న, పరిణయము దుఃఖముగాఁబరిణమించును. కార్యఫలిత మెట్లుండునో యోర్పుతో ముందూహించుటయే బుద్ధిలక్షణము, విదుషీమణివగు నీ కింతకంటె వేరుగఁ దెలుప నగత్యము లేదు.

ఇందిర:—దయానిధీ! అటులనా! ఆసదాశయుఁడు నాయనురాగముపై విముఖతను జూపెనా! ఇది నిక్కవమా?

మయూర:—పుత్త్రీ! నీకు నామాటలపై నమ్మిక లేనిచో అమాత్యు నిటకుఁ బిలపింతును. నీవ యాతని నడుగుము. అని మంత్రి నచటికి రాఁ బిలపించి, "సచివోత్తమా! ఆ వైశ్యకుమారుని తలంపును మాయిందిరకు వివరించి ఈమె పిచ్చితలఁపును దొలగింపుము. నేను నాయర్ధాంగితో నీయంశమును గూర్చి ముచ్చటించి వత్తును" అని వెడలిపోయెను. అపు డమాత్యుఁడు ప్రభుశాసనముచే నిందిరకడకేగ ఆమె యాసచివుని గాంచి నమస్కరించి, ఇట్లు ప్రశ్నించెను.

ఇందిర:— అమాత్యశేఖరా! ఆమునినందనునితో మాటలాడితిరా? నాప్రేమస్వరూపమును ఆసుచరితునకు విశదము చేసితిరా?

అమాత్య:—అమ్మా! ప్రభుపుత్త్రీ! నీవినయసౌశీల్యాది గుణములఁగూర్చియు, నీకాతనిపైఁ గలప్రేమను గూర్చియు, ముచ్చటించి, పిమ్మట సంప్రాప్తము కానున్న రాజ్యసంపదనుగూర్చి కూడ విపులముగా వివరించితిని.

కాని తల్లీ! ఆబ్రహ్మచారి నేనెంత బోధించినను పితృసేవాసక్త చిత్తుఁడై నినుఁ బరిగ్రహింప నంగీకరింపఁడాయె? అమ్మా! అట్టివిరాగినిఁ గట్టికొని, నీ వెట్టి సుఖ మనుభవింపగలవు? కావున ఈరాగ విరహితునివైపు పోవుచున్న యనురాగ

వాహినిని మరల్చి, యికనొక చక్రవర్తి తనూభవుని మీదికిఁ బ్రవహింపఁ జేయుము. ప్రాజ్ఞులు పరిణయ నిర్ణయమునకు ఒక్క ప్రణయమునే ముఖ్యముగాఁ జేకొనరు. అందుకుఁ గుల మర్యాదాసంపదలను గూడ ప్రధానములుగా నెంతురు.

ఇందిర:—ప్రభుహితాభిలాషీ! మనీషీ! అకలంకమగు రాగాంకుర ముదయింపఁ జేయుటకుఁగాని, తలసూపిన మక్కువ మొక్కను త్రుంచివేయుటకుఁగాని, మానవులకు సాధ్యము కాదు. పుష్పమునం దామోదము సహజముగా జనించునటుల హృదయమునందుఁ బ్రేమామోదము ఆవిర్భవమగును. మఱియుఁ బరిణయమునకు శీలసంపద ముఖ్యముకాని కేవల కుల ధనాదులుకావు.

సచివవరేణ్యా! పలు బాసలేల? పద్మినీ వదనారవింద మును సౌభాగ్యవంతమునుగాఁ జేయునది దినకరకరప్రసారమే. నాహృదయమును ఆనందభరితమును గాఁజేయ జాలునది యీ విశ్వమున ఆవైశ్యకుమార పాణిగ్రహణమే. కావున నామనో రథ మీడేర్ప సాయపడుముకాని, నాయనురాగమును నిరోధింపఁ బ్రయత్నింపకుము. మీ రనుగ్రహించినచో నా మనోరథ మీడేరఁగలదు. ప్రభువుల కార్యదీక్షలు దక్షులగు మంత్రుల ప్రాజ్ఞతలపై నాధారపడి యుండును కదా?

అమాత్య:—అమ్మా! నీ యభిలాష ప్రశంసనీయమే. కాని యీతాపస నందనుఁడు నీ వివాహమునకు సుముఖుఁడ

గుట లేదు. నేనేమి చేయుదును? ముందాతఁ డంగీకరించిన కదా! నేను మాయేలిక నొడఁబరచుట?

ఇందిర:—అట్లైన నే నీపద్మతో నాతనికడ కేగి, నా ప్రేమ పరితాపముల స్వయముగాఁ దెలిపికొనుట కవకాశము కలిగింపుము.

అమాత్య:—అమ్మా! ఇందు దోషమేమున్నది. తప్ప క యట్లనే సేయుదును. ఆతఁడు నామెూటు మాటలకు మోమా టము చూపకున్నను, నీలలితాలాపములు ఆతని చెవినిఁ బడిన తోడనే నినుఁ జేపట్ట నొడఁబడునేమో? సరసోక్తులు నల్లబా లను గూడఁ గరగింపగలవు కదా! పోయిరమ్ము.

అంత ఇందిర రాజమందిరమున నొంటరిగనున్న శ్రావ ణుని కడకుఁ జెలికత్తెతో నేగి, ఇటుల సంభాషించెను.

ఇందిర:—ఆర్యనందనా! వందనము. నే నిందిరయను మయూరరాజ నందనను. ముందు నేగాంచిన మనోహరమగు నీసౌమ్యసుందర రూపమును, ఆపైని, నే నాలించిన నీపావన మగు పితృభక్తియు, అటుపైని నే గాంచిన అనన్య సామాన్య మగు నీకాంచన విరక్తియు, ఆవెంట నేఁ దెలిసికొన్న శృతిసుఖ దమగు నీవాఙ్మాధుర్య సంపత్తియుఁ గ్రమముగా నాడెందమును స్వాధీనము చేసికొన్నవి. సువ్రతా! విమలాశయులగు ఆర్యకన్య లకు గుణములపై నాసక్తిమెండు. అందుచే నే నినుఁ బతినిగాఁ బడయ నభిలషించితిని. కావున నామనోరథ మీడేర్చి, నన్ను ధన్యనుగాఁ జేయవలయును.

శ్రావణ:—కోసలసార్వభౌమపుత్రీ ! మంత్రిసత్తము నివలన వింటిని నీతలంపు సొంపులను, కాని శుభాంగీ! సమవస్తు సమ్మేళనము శోభావహము. విరుద్ధ పదార్థ సంయోగము వికారజనకము.

ఇందిర:—మన కలయికయం దట్టి విరుద్ధ మేమున్నది?

శ్రావణ:—భూలోకవాసియగు మర్త్యుఁడు స్వర్లోకవాహినీ రసముల గ్రోల శక్యమగునా ? అట్టి కోరిక విరుద్ధము కాదా ?

ఇందిర:—ఎంతమాత్రమును విరుద్ధము కాదు. ఆమందాకిని అమందానురాగముతోఁ గ్రిందికి దిగివచ్చి, యాపుణ్యాత్ముని ముోల నిలచిన దానిరసముల నాస్వాదింప నగును కదా ?

శ్రావణ:—కటికబీదరి ప్రాకటవైభవుఁడగు సార్వభౌమునితో బాంధవము నెఱపఁ గోరుట విరుద్ధము కాదా ?

ఇందిర:—అటులగుచో అకించనుఁడగు భక్తుఁడు సకలైశ్వర్యసంపన్నుఁడగు శ్రియఃపతితో నైక్యము కాఁగోరుట యు విరుద్ధమే యగును. కాని విబుధులెల్లరు నట్టి సంయోగము నపేక్షించుచున్నారు కాని విరుద్ధమని తలంచి, విరమించుట లేదే?

శ్రావణ:—దేశకాలపాత్రముల గుఱు తెఱిఁగి, కార్యాచరణమునకుఁ బూనవలయును. నాకిపు డామూఁడును విరుద్ధ

ముగానే యున్నవి. కావున దేశకాలాదుల ప్రాశస్త్యమును బరిశీలించి, నీవు వేఱొక సంపన్నునిఁ బ్రేమింపుము. విమవు మీాకావిగుడ్డల కావడివానిని.

ఇందిర:—ఘనాశయా! ప్రేమోదయమునకు దేశకాలములతో నిమిత్తము లేదు. పాత్రతయొక్కటియే ముఖ్యము. అది నీయందు సంపూర్ణముగాఁ బ్రకాశించుచున్నది. కావున నా యాశాకోరకమును ద్రుంపక, వికసింపఁ జేయుము.

శ్రావణ:—వలపు కలిగినంతనే పరిణయమునకుఁ ద్వరపడఁ దగునా? తనతలపు కులమర్యాదల కనువగునో కాదో యోజింపవలదా?

ఇందిర:—సుభాషీ! ఒకనిపై నుదయించిన వలపును వేఱొక్కనిపైకి మరలింపఁ గోరుట కులసతులకుఁ గానిపని. వలపు నిలకడ కానినాడు స్త్రీలోక మధోగతి పాలగుట నిక్కువము. పావనచరితా! ఏల యీా సంవాదము. వినుము నా నిశ్చయము. నిన్ను వినా నే నన్యునిఁ గలలోఁగూడఁ గలయఁ గోరను. నన్ను పరిగ్రహింపక పరాభవించుట నీయట్టి సాధుకుమారులకు న్యాయము కాదు.

శ్రావణ:—(తనలో) ఈనృపతనయ నాపై నమిత వ్యామోహితయై యున్నది. నే నీపె వలపునకుఁ వలయూచితినా పితృసేవా భాగ్యమునకు దవ్వగుట నిశ్చయము. ప్రస్తుత మిట నుండి వెడలిపోవుట యుచితము. (పైకి) రాజపుత్రీ! నే స్వ

తంత్రుఁడను కాను. నాతలిదండ్రుల యాజ్ఞలకు లోఁబడి నడువ వలసిన వాఁడను. కావున వారితో నాలోచింపక నే నేమాట ను చెలుపఁజాల !

ఇందిర:—గురువిధేయా ! వారి యాజ్ఞనుఁ బడసియే నా యభీష్ట మీడేర్పుము.

శ్రావణ:—అటులైన సెలవొసంగుము. పోయి వచ్చెదను.

ఇందిర:—సత్యధనా ! ఇపుడు నీవన్న తుదిపదముల మఱువకుము. పోయిరమ్ము. మనోహరా ! నీవు రాకున్న నా ప్రాణములు నిలువఁ జాలవని యెఱుంగుము.

---

# అష్టమాశ్వాసము.

పితృభక్తి.

శ్రావణుఁడు రాజమందిరమునుండి పితరుల కడకేఁగి, నమస్కరింప వారాతని దీవించి, తమచెంతఁ గూర్చుండఁ బెట్టుకొని, యిట్లు ప్రశ్నింపఁ దొడంగిరి.

పితరులు:—కుమారా! ఆసార్వభౌముఁ డెందులకు నినుఁ బిలిపించినాఁడు? రాజమందిరమున జరిగిన విషయమేమి? మన తీర్థాటనమునకు, ఆటంకము కలుగదు కదా? ఇట మన ప్రసంగముల నాలించువా రెవ్వరును లేరుకదా?

శ్రావణ:—ఆర్యులారా! ఇట మనము మువ్వురము తక్క వేఱెవ్వరును లేరు. స్వేచ్ఛగా మాటలాడవచ్చును. అని రాజమందిరమున నడచిన గాథనంతను పూసగ్రుచ్చినట్లు వివరముగా వినిపించెను. అన్నపూర్ణా విశ్వనాథు లావృత్తాంతము నాలించి, యిట్లు పలికిరి.

విశ్వనాథ:—నాయనా! అట్లు వినయానురాగములతోఁ బ్రార్థించుచున్న కన్నియకోరికను నిరాకరించుట యుచితమనియే తలంచితివా?

అన్నపూర్ణ:—తండ్రీ! అప్రయత్నముగా దైవము సమకూర్చిన మంగళములఁ గాదన రాదేమో! యోజించితివా?

శ్రావణ:—వత్సలులారా! పితరులారా! తలంచితి. యోజించితి. నాకు మీపాదారవింద పరిచర్య వాంఛనీయము. కాని, కాంతా కనకములు కావు. దయామయులారా! ఇప్పుడు నే నారాజకన్యను బరిగ్రహింప నంగీకరించితినా, ఉభయ లోకానందసంధాయకమగు మీపదపంకజారాధనమునకు నంతరాయము వాటిల్లి తీరును. ఏమందురా!

నే నీ భూనేతకు జామాతనైతినా? ఆరాజు నన్ను అంధులగు మీకు సేవలఁ జేయనీయడు. అందులకుఁ గింకరుల నియమింతు మనును. ఇఁక నేనన్ననో! రాజసౌధమున మహారాజ వైభవముల ననుభవించుచు, మీరున్న మాటయే మఱచునంతటి దుస్థితికి వత్తును. ఎవ్వరేని మీదీన స్థితిని గూర్చి ప్రస్తావించిన మీయట్టి పేదలు నా వా రనిపించుకొనుటకుఁ గూడ సిగ్గుపడఁ జొత్తును. కావున, అట్టి దుర్దశ సంప్రాప్తము కాకుండుగావుత యని తలంచి, రాజకన్యకామోహమునకు దూరముగా నుండ నిశ్చయించితిని.

అన్నపూర్ణ:—కుమారరత్నమా! నీయట్టి శీలవీరున కట్టి దుర్దశ యెన్నటికిని కలుగనేరదు. తండ్రీ! నాకొక యభిలాష కలదు. తెలుపుమందువా?

శ్రావణు:—అమ్మా! నేను నీకోరికను నెఱవేర్తునో లేదోయని సంశయించు చుంటివా?

అన్నపూర్ణ:—గుణనిధేయా ! నే నెంతమాత్ర మట్లు భావించుట లేదు. నాకోరిక నీయూహలకుఁ గొంచెము వ్యతిరేకముగా నుండు నేమోయని తలంచి, యి ట్లడిగితిని కాని, నీభావపావనత నెఱుఁగక కాదు.

శ్రావణ:—మాతకో! ఇంతవఱకు నెఱవేఱక, నీమానసమున నిలచియున్న యభిలాష యేదియో సెలవిమ్ము. ఈ దాసుఁడు దానిని సాధించుటకుఁ బ్రాణములఁగూడ విడచునని తెలిసికొనుము.

అన్నపూర్ణ:—దయాసాగరా ! తెలుపుకును వినుము. విని, కాదనకుసుమా?

శ్రావణ:—సాధ్వీమతల్లీ ! తల్లీ! నేటినుండినాకు దుర్దినములు ప్రారంభ మగునని తోచుచున్నది. లేకున్న నింతదనుక వెనుదీయక మీయాజ్ఞలఁ దలను దాల్చి, నెఱవేర్చుచున్న సుతుఁ డిపుడు సంశయాస్పదుఁ డగునా ?

అన్నపూర్ణ:—నందనా ! తల్లులు పిల్లలను, పిల్లలు తల్లులను నమ్మని దినములు ముందువచ్చిన రావచ్చును. ఈ త్రేతాయుగమున నట్టిప్రేత లుదయింపరు. నాయభిలాషకు నిన్నుఁ బ్రసన్నునిగాఁ జేయనెంచి, యిట్లు ప్రశ్నించితినికాని, వేరొక తలంపుతోఁ గాదు. వినుము, నాకోరికను. సౌభాగ్యవతియగు కోడలు మాకు వందన మొనరింప "సుపుత్రీభవ" అని దీవించుటయే. ఇందుకు సమ్మతింపవలయు.

కుమారా! ఇటువినుము. నీతలిదండ్రులు రేపో, నేఁడో యను తుదికాలమునకు వచ్చియున్నారు. నీవా! నవోన్మేష మగు యౌవ్వన సంపదతో నలరారుచున్నవాఁడవు. ఇపు డీ నాగన్నియను జేకొని రాజ్యసంపదల రాబట్టుకుంటివా నిన్ను పేదఱికము ముట్టడించి యుండునేకాని దూరముగాఁ దొలఁగి పోనేఱదు.

శ్రావణ:—అమ్మా! చంచల రాజసంపదలు సమకూరునను భ్రాంతిచే శాశ్వతమగు నాత్మగౌరవభాగ్యము త్యజింపనగునా?

అన్నపూర్ణ:—శ్రావణా! ఆతపకాంతి కాదిత్యమండల మాధార మైనట్లు, ఆత్మగౌరవమునకు ధనభాండము మూలము. కావుననే కీర్తికాములు భాగ్యాభిలాషులై యుందురుకాని, వసు నిస్పృహులై యుండరు.

శ్రావణ:—తల్లీ! నీబోధలకుఁ దలయొగ్గక యొగ్గు సేయుచున్నందులకు క్షమింపుము. జననిరో! నీనందనుఁ డనాలోచితముగా రాజకుమారీ రాగరజ్జు బద్ధుఁడైనచో నటుమీఁద మీకును తనకును కూడ గౌరవానందముల సమకూర్ప నేరఁడు. పితృ దైవతములారా! మీ రెఱుంగని ధర్మ రహస్యములు కలవా? షడ్విధ దుఃఖభాగులలోఁ బరభాగ్యోపజీవి యొక్కఁడు కాఁడా? ఇప్పుడు మనకుఁ జేకూరనున్న భాగ్య మట్టిదియే కదా?

విశ్వనాథ:—తనయా! అటులైన మన కీదారిద్ర్యమే మోక్షసామ్రాజ్యమని తలంతువా ?

శ్రావణ:—ప్రియజనకా! మన మిపుడు పేదరికములో నుంటిమని తలంచుచుంటిరా ? అటులగుచో మీయూహ సరియగునది కాదు. కనుడు. కరమున గవ్వ లేనివానికంటె చేతఁగాసున్నవాఁడు భాగ్యవంతుఁడు. పదిరూకలున్న వానికంటెఁ నూరు రూపాయలున్నవాఁడు సంపన్నుఁడు. లక్షాధికారికంటెఁ గోటీశ్వరుఁడు శ్రీమంతుఁడు. ఇట్లారోహణ క్రమముగాఁ జూచినఁ బైవారెల్లరు భాగ్యశాలురగుదురు. అవరోహణ పద్ధతినిఁ బరికించినఁ గ్రిందివారందఱు దరిద్రు లగుదురు. దీనింబట్టిచూడఁ గలిమిలేములు జనులందఱకును తుల్యములే యని బోధపడును.

పితరులారా! నిజమారయ నాయంతటి భాగ్యశాలి వేరొకఁ డీభూమండలమున లేడని, శంఖారావముతో సాటింతును. పితృసేవాసక్తచిత్తునకున్న గౌరవానందములు సామ్రాట్టులకుఁ గూడఁ గానరావు. కావునఁ, గృపామయులారా! మీచరణపరిచరణ సహకార మహీరుహ శాఖపై వ్రాలి, నిత్యానంద రుచ్యఫలముల నాస్వాదించుచున్న నామానస కీరమును నిష్ఫల భూపైశ్వర్య శాల్మలీతరువుపైకిఁ దరిమివేయకుడు.

మఱియు, రాజానుగ్రహ లబ్ధమగు నన్నమును దినుచు, గృహపారావతము వలె జీవించు నేను ఆరాకొమరితకు భర్త నెట్లు కాఁగలను? ఇల్లాలి నుల్లాసముగఁ బాలించువాఁడు భర్తృపదార్హుఁ డగునుకాని, సతీసంపదచే బ్రతుకువాఁడు కాఁడు కదా! ఇంతియెకాదు. ధనాశనో, యువతీవ్యామోహముననో, నిజకుల కన్యలఁ బరిగ్రహింపక విజాతి కామినులఁ జేపట్టువారికి, ఇట స్వకులమునందును, అటఁ బరజాతియందు ను కూడఁ బరాభవములే కాని మర్యాదలు కానరావు. వీధిఁ బోవు వారందఱు, ఆ విరుద్ధదంపతుల వేలెత్తిచూపుచుందురు. కావున, నేవిధమునఁ జూచినను, మన కీరాజబాంధవము బాధక మగునుకాని యానందసంధాయకము కానేరదు.

మఱియు అమ్మా! నేను భిక్షాపాత్రమును జేపట్టుచున్న ప్పుడు, నీవభిమానముతో "పాపము శమించు గావుత" అని యంటివే. అట్టి నీవిపుడేల యంతకంటెను నికృష్టమగు పరాన్న భక్షణమునకు నను బాల్సేయఁ జూచుచుంటివమ్మా? తల్లిదో! తాము తలపెట్టిన యన్నదానయాగమును నిర్విఘ్నముగా సాగిం చుకొని, సుతులు సంకల్పించుకొన్న, పితృసేవావ్రతమును భంగపఱుపఁ జూచుట ధర్మనిరతలగు మాతలకు న్యాయమగునా?

తలిదండ్రులారా! మీకు నాపైనలుక కలిగినచో దూరముగాఁ దొలగి పొమ్మనుడు. అంతియకాని నన్ను భూపకుమారీపరిగ్రహణమునకుఁ బురిగొల్పకుడు. పరికింప నీవ్యాపారము

సాగరతరంగములవలె పరాభవపరంపరలు కానవచ్చుచున్న వి. వివాహానంతరము సొత్తుమాలిన నష్టమాము లేకాక, వారి పనికత్తెలు కూడ అలసుచేయుట నిక్కువము.

మానధనులారా! స్వయముగా వాణిజ్యవృత్తిచే సంప దల నార్జించి, పదుగురం బోషించుచు స్వేచ్ఛగా సంచరింప నర్హుమగు వైశ్యకులమునబుట్టిన పురుషుండు, కాకివలెం బొరు గింటి యెంగిలి మెతుంకులకు వేచియుండనగునా ? వివేకసాగ రులారా ! పితరులారా! నే జేలకో ! మీరలు నీరసంపుబాస లాడుచున్న వారుకాని యుదారభావముల వెల్లడించుట లేదు. ఇది నాగ్రహాచార దోషమైయుండనోపు.

అన్నపూర్ణ:—వత్సా ! మేము నిను బరాభవములం బాల్సేయం గోరుటలేదు. నీ వారాజపుత్రినిం జేపట్టిన సుఖిం తువని తలంచి, యిట్లు పలుకుచుంటిమి. నాతండ్రీ ! మాకు వార్ధకలోపము కాని, అంధతాఖేదము కాని తెలియరాకుం డ సర్వసౌఖ్యముల సమకూర్చి, కాపాడుచున్న నిన్ను మేము దూరముసేయంజూతుమా? నాయనా ! మానుడువులు నీకిం తటి సంతాపమును గలిగించునని తలంపమైతిమి. తండ్రి ! మా పొరబాటు మాటల మన్నింపుము.

విశ్వనాథ:—పుత్త్రరత్నమా ! నీవు మమ్ముం బాసియు న్ననాడు మాదేహములం బ్రాణములుండి యేమిప్రయోజనము? నీవు తెలిపినట్లు చక్రవర్తిపుత్త్రికను బరిగ్రహించినచో బందాలు

చరయందుండునట్లు మన మారాజమందిరమున దీనులమై యుండవలసినదియే. మేము దూర మాలోచింపక, నీవు రాజకన్యను బరిణయమాడినచో పేదరికమునుండి రాజరికములోని కేగుదువనియు, దాన నీకన్నియు నానందములే సమకూరు ననియుఁ దలంచితిమి. నీయుపన్యాసముచే ఆభ్రాంతితొలఁగి సత్యము గోచరమైనది.

శ్రావణ:—పితరులారా! మీరిపుడు నాసంకల్పమున కనుకూలు రగుటచే నాహృదయము నీహారముక్తమగు నరవిందము వలె స్వచ్ఛమైనది.

అన్నపూర్ణావిశ్వనాథులు:—కుమారా! మనమిపుడు చేయవలసిన పనియేమి?

శ్రావణ:—దయామయులారా! మన మిక నిట నుండుట భద్రముకాదు. ఆరాజనందన నాపై వ్యామోహితయై యున్నది. ఆమె జనకుఁడు బలవంతుఁడగు భూపాలుఁడు. ముందేమికీడు మూడునో తెలియదు. కావున మన మీరాత్రియే యెవరికిఁ దెలియకుండ ఈపురమును విడచి, వేఱొక యేలిక సీమలోఁ జేరుట శ్రేయస్కరము.

అని తెలిపి, వెంటనే తలిదండ్రులఁ దోడ్కొని, మత్తేభమువలె నెక్కడను నిలువక యతివేగముగా దక్షిణకోసల సీమను బాసి, ఉత్తరకోసలారణ్యమునఁ బడి, యేగుచుండె.

అన్నపూర్ణకు దాహబాధచే నాలుక యాఱ్చుకొని పోఁజొచ్చె ను. అపు డాసాధ్వి యిట్లు పలికెను.

అన్న:—కుమారా! నాకు దాహబాధ భరింప శక్యము కాకున్నది. ఇఁకనొక నిముసములో నానోటికి నీటి నందింపకున్న నీయుపచార సంపదను, గోలుపోవుదువు. కావున, వెంటనే మంచినీటికై ప్రయత్నింపుము. ఆమాటల విన్నతోడనే శ్రావణుఁడు కావడి నొకవృక్షముక్రింద దింపి, కలశమును పట్టుకొని "అమ్మా! ఇదే యరనిముసములో దాహోదకముఁ గొనివత్తును. నే వచ్చువఱకు శ్రీహరిని స్మరించుచుండుము." అని నీటికై వెదకుచుఁ బోయి, సరయూనదినిఁ గాంచి, తల్లి దాహబాధను దొలగింపఁ గలిగితినను సంతసముతో వడివడిగా నదిలోనికేగి, నీరములోఁ గలశమును ముంచుచుండ వాఁడి కోల యొకటి వచ్చి, ఆతనియురమున నాటెను. ఆవేటునకు "హా! తల్లీ!" అని కేకవేసి తీరభూమిపై నొరగెను.

---

# నవమాశ్వాసము.

## విమానయానము.

తెల్లవారుజామున సరయూతటమున అస్త్రాభ్యాసము చేయుచున్న దశరథరాజేంద్రుఁడు ఆయార్తనాదమును విని లోనిప్రాణములు పైకెగయ "కట్టా! నాచే విడువఁబడిన యలుగెవ్వనికో! ప్రాణహరముగాఁ దాకినది." అని నదీతీరమున కేఁగి, అన్వేషింపఁ గలశహస్తుఁడై నేలఁబడియున్న మునికుమారుఁ డొకఁడు కంటఁబడెను. రుధిరార్ద్రగాత్రుఁడై బాణబాధకుఁ దాళఁజాలక, కొట్టుకొనుచున్న యాతాపసనందనుని సమీపించి, కారుణ్య ముప్పొంగ దశరథుఁ డిట్లు ప్రశ్నించెను.

దశరథ:—ఆర్యా! నీవెవ్వండవు? ఇటకేల వచ్చితివి? అన శ్రావణుఁడు కొంచె మొత్తిగిలి కన్నులువిప్పి, దశరథునిఁ జూచి, యిట్లు దీనముగాఁ బలికెను.

శ్రావణ:—అయ్యా! నే నొక పితృసేవకుఁడనగు మునితనయుఁడను. "అయ్యయో తల్లీ! నీ కిన్ని మంచినీళ్లియ్యఁ జాలనైతినే! అయ్యో! ఈపాటి కాసాధ్వి దాహబాధ కోర్వఁజాలక ప్రాణములఁబాసి యుండును. ఓ క్రూరదైవమా! ఎంతపని చేసితివి!" అని తిరుగఁ గనులమూసికొని కొట్టుకొనఁ దొడఁగెను.

దశరథుఁ డాబాలుని మరణబాధను గాంచి, కటకటా! నేనెంతటి పాపాత్ముఁడను, ఈమునిసుతుని హతమొనర్చె బ్రహ్మ

హత్యాపాతకము నే కాక ఈతని మాటలను బట్టిచూడ స్త్రీహత్యాగారితమును గూడ సంపాదింతు నని తోంచుచున్నది. నాజన్మచే స్వచ్ఛమగు సూర్యవంశ యశఃపటముపై మచ్చ యేర్పడినది. అని విచారించుచుండ ఆమునిసుతుఁడు కనులు తెఱచి, యిట్లు పలికెను.

శ్రావణ:—మహాశయా! మీర లెవ్వరు? ఇట్లేల విచారించు చుంటిరి? ఆర్యా! నన్నుఁ జంపినవానికి బ్రహ్మ హత్యాపాపము రానేరదు. నేను విప్రబ్రహ్మచారిని కాను. వైశ్యవటుఁడను.

దశర:—సాధువదనా! నీ కీదుర్దశను సంఘటింపఁ జేసిన కిరాతుఁడను నేనే. ఇస్సీ! చేతులార నెంతటి దురిత కార్య మొనరించితిని!

శ్రావణ:—ఓయీ! నీవు కిరాతనాయకుఁడవా? అన్నా! నీకు వన్యమృగములఁ గొట్టుట న్యాయముకాని, మాన్యులగు తాపసకుమారులఁ జంపుట యుక్తమా?

దశరథ:—మునికుమారా! నేఁ గిరాత నాయకుఁడఁ గాను, అంతకంటెను పాతకినగు సాకేత నాయకుఁడను. ఈ యేటి యొడ్డునుండి బుడబుడ యను నలుకుడు వినరా నడవి యేనుఁగుతొండముతోఁ దోయములఁ గ్రోలుచున్నదని తలంచి, శబ్దవేధి శస్త్రమును వింటఁదొడిగి, ఆనినదమును గురిచేసి విడచి తిని. విధివశమున నాశరము నీయురమున దూరి, నిను గూలఁ నేసి, తోడనే పడద్రోసినది, ఇనకులము నపకీర్తిని.

శ్రావణ—ఏమీ? నీవుత్తరకోసల సార్వభౌముఁడవా? ఔరా! ఆదక్షిణకోసలమున మసలుట మంగళావహము కాదని తలంచి, ఈయుత్తరకోసలమునఁ జేరి, ప్రాణములఁ బాయుచుంటిని! లలాటలేఖను మార్పఁ దరమగునా? అయ్యా! గడచినదానికి వగవక, నాకొక యుపకారము సేయుము. సంతోషముతో జీవితమును ముగింతును.

దశరథ:—తమ్ముఁడా! నేఁ జేయవలసిన యుపచార మేదియో తెలుపుము. నాయపచారము క్షమియింపుము.

శ్రావణ:—ఆర్యా! నాతలిదండ్రులు శతవృద్ధులు, అంధులు. అంతు మాయమ్మ దాహపీడితయై యుండ నేను వారినొక భూరుహముక్రిందఁ గూర్చుండఁ బెట్టి, దాహవారినిఁ గొంపోవ నిటకువచ్చి, నీతూపుచేఁ గూల్పఁబడితిని. కావున నీ వీకలశముతోఁ దోయములఁ దీసికొని, మాటలాడక మా తల్లి కడకేగి, త్రాగనిమ్ము. ఆమెకు దప్పి తీరిన పిదప నా యవసాన వందనములు నాపితరుల కందింపుము. పాప మాదీనులకు నేను దక్క వేఱు దిక్కు లేదు.

దశరథ:—కట్టా! నేనెంతటి కలుషాత్ముఁడను, ఇపు డీ సాధుకుమారుని, ముందీతని పితరులనుఁ, జంపనుంటిని! నేనిక క్షత్రియపదార్హుఁడను కాను. క్రవ్యాదపదమునకుఁ దగినవాఁడను. కోసలసింహాసనము ముట్టఁదగను. కోయజాతిలోఁ బుట్టఁదగుదును.

శ్రావణః—అయ్యో! నాజీవితవినాశమును గూర్చి చింతింపకుఁడు. అసహాయులగు తలిదండ్రులఁ దలంచి, దుఃఖింపుఁడు. ఇఁక వారినోటికి నీటినిఁ గూటిని, అందిచ్చువారెవరు ? కటకటా ! మాయమ్మ తుదిదప్పికను దీర్పఁజాలనైతినే! ఈపాదుకములకు, నేను మాయమ్మ దాహముతీర్చిన పిదప, నాగుండెకు దాకినచో బాగుండెడిదే! కర్మమిట్లుండ నేల జరుగును.

ఔరా! ఏమి యీకర్మవైచిత్ర్యము! ఒక రాకొమరికూరిమిబారినుండి తప్పించుకొనఁ గోరి, వేఱొక రాజకుమారుని శరమునకు గురియైతిని! అయ్యయ్యో! నాతల్లి దాహబాధకుఁ దాళలేక "శ్రావణా"! అని యెలుగెత్తి నన్నెన్నిసార్లు పిలచి యుండునో! పాప మాతపస్విని ప్రాణముల వీడునేమో! ఓయన్నా! నీవు నాప్రార్థనము మన్నించి, త్వరితముగ జలములఁ గొంపోయి, మాయమ్మకుఁ దాగనిమ్ము. నాపితరు లిటకు దక్షిణముగా నున్న యొక తరుతలమున నున్నారు. సోదరా! శరపీడను భరింప నేరకున్నాను. కావున ముందీనారాచము నాయురమునుండి తొలఁగింపుము.

దశరథుఁడు, శ్రావణుఁడు కోరినరీతిని వక్షమునుండి బాణము నూడదీసినతోడనే "హా! శ్రీహరీ!" అని ప్రాణముల విడచెను. కోసలాధిపుఁ డాతని మరణావస్థను గాంచి, కడు దుఃఖితుఁడై, కలశముతో నీరములఁ జేకొని, మునిదంప

తుల కడకు వెడలెను. అపుడు సుతునిరాక కెదురుచూచుచు విశ్వనాథుఁడు దశరథుని పదధ్వనిని విని యిట్లుపలికెను.

విశ్వనాథ:—ప్రియనందనా! ఇంత జాగేలఁ జేసి యయ్యా! "దాహము" "దాహము" అని నీతల్లి వాపోవుచున్నదే! "తండ్రీ! శ్రావణా!" యని పలుమారు నిన్నుఁ బిలుచున్నదే! నాయనా! మే మారాజకన్యాపాణిగ్రహణము గూర్చి పలికినమాటలు నీకుఁ గోపమును కలిగించెనా? మాటలు పలుకవదేల?

అన్నపూర్ణ:—ప్రాణాధికుఁడా! నందనుఁడా! వచ్చితివా? టురా. నాకొక ముద్దిచ్చి, పిమ్మట నీటినొసంగుము. మేము సౌఖ్యముగా నున్నప్పుడు కూడ మమ్మొడబాసి యుండ నేరవైతివే! ఇట్లు నేఁ బిపాసార్తనై యున్నప్పుడు, ఇంత తడవు మేల చేసితివోయి?

విశ్వనాథ:—గురువిధేయా! ఒక్కపటువుగున మమ్ము దూరము మోసికొని వచ్చుటచే నాయాసము కలిగెనా? నీటికై పఱుగిడుటచే నలసట జనించెనా?

అన్నపూర్ణ:—ప్రాణేశ్వరా! ఈవచ్చువాఁడు మన బిడ్డఁడు కాడు, ఆసచ్చరితుని నవనీతసమానకోమలహృదయుఁడని మనకుఁ దెలియదా? నిక్కముగ నీతఁడాతఁడే యైనచో నింతవఱకు మనకుఁ బ్రతివచన మొసంగక, యిట్లు బాధింపఁ బరికింప వీఁడెవ్వఁడో పాషాణహృదయుఁడగు పాపాత్ముఁడుగాఁ జూపట్టుచున్నాఁడు.

విశ్వనాథ:—ప్రేయసీ! నాకు నల్లే పొడగట్టు చున్నది. అడగి మూచెదను. "అయ్యా! నీవెవ్వండవు? మాటలాడవేల? చోరుడవా? మాకడ నీ వపహరింపఁ దగిన సొత్తెద్దియును లేదు. మాకుఁగల పెన్నిధానము మాతనయుఁడే. ఆతఁడిపుడెట నున్నాడో! ఎటులనున్నవాఁడో! తెలియరాకున్నది.

వారిపరితాపోక్తుల నాలించి, దశరథుఁడు నాలుక తడి యార దేహము కంపింప మెల్లగా నిట్లుపలుకఁ దొడఁగెను.

దశరథ:—తల్లీ! ముందీనీరములఁ బానము సేయుము. పిమ్మట నావృత్తాంతమును నివేదింతును.

అన్నపూర్ణ:— ఓయీ! మానందనుఁడుండ నీవేల నీరములఁ దెచ్చి యిచ్చుచుంటివి? నాతనయుఁడు వచ్చి జలమిచ్చినఁగాని నేఁ జేకొనను. ప్రాణేశ్వరా! ఏదియో విపరీతము జరిగినది. తప్పదు. నాకుడి కన్నదురుచున్నది. నాయంతరాత్మ తల్లడిల్లుచున్నది.

విశ్వనాథ:—ఆర్యా! మాశ్రావణుఁ డెచ్చట నున్నాడు? తాను స్వయముగాఁ జలములఁ దీసికొనిరాక, నిన్నేల పంపె? మయూరరాజభటు లాతనిఁ జెఱఁబట్టిరా? జాగుసేయక వెల్లడింపుము. మాజీవితముల నిలువఁబెట్టునవి మా కుమారుని కుశలవార్తలుకాని, నీవు తెచ్చిన నీరములుకావు.

దశరథ:—మునివరా! నేను దశరథుఁ డనునృపుఁడను. (తనలో) "అబ్బా! ఏమని తెలుపుదును ఆదారుణమరణవా

ర్తను! తెలుపకుండుట యెట్లు. తెలిపిన వీరలు ప్రాణముల విడతురే!" అని బహువిధముల చింతించి, జఁగిన దుర్వార్తను వివరించెను. ఆయమంగళ వృత్తాంతమును విన్నతోడనే ఆదంపతులు "హా! ప్రియనందనా! శ్రావణా! మమ్ముఁబాసి యేఁగితివా?" అని మూర్ఛితులై నేలపైఁ బడిపోయిరి. దశరథుఁడు కలశోదకములచే వారి మూర్ఛదేర్ప, ఆవృద్ధులు కన్నులనుండి దుఃఖజలములు కాల్వలై పార ఇట్లు విలపింపఁ దొడఁగిరి.

విశ్వనాథ:—ప్రియనందనా! అనాథులమగు మమ్మిట్లు ఘోరాటవీమధ్యమున దురంతచింతలఁ బాలుసేసి, నీవొంటరిగఁ ద్రిదివమునకేఁగ మనసెట్లొప్పె? దాహపీడితయగు మాతకుఁ బానీయముల నొసంగక, ముక్తినంద, నందనునకుఁ దగునా? అఱనిముసములో వత్తునన్నమాటను బాటింపకుండుట న్యాయమా? బిడ్డా! మాకెవ్వరిని సంరక్షకులనుగా నేర్పాటు చేసి పోతివోయి? కటకటా! ఎట్టిదుర్దినము సంప్రాప్తమాయె! వత్సా! ఇఁక మాతో మాటలాడవా? ఓదశరథా! మానందన స్నేహము నింకఁజేసి, మాజీవితదీపముల నార్పివేసితివి.

అన్నపూర్ణ:—కట్టా! సుకుమారా! కుమారా! ఈ భూపాలుఁ డొక్క కోలతో నిను నేలఁగూలనేసెనా? మాపెనా మాసుత సంపదను! ఇకఁనాకు ముద్దులొలుకు నీసుద్దుల వినిపింపవా? ఇంతటితో మాతోఁగలసి యుండుటను ముగించితివా?

మాయన్నా! దాసివలెను, దాసునివలెను, మాకు సమస్తోపచారములఁ జేయుచుంటివే! ఇఁక మాగతి యేమగు నని తలంచితివోయి? హా! దైవమా! నేనొర్చిన యన్నదానమునకు ఫలమిదియా? ఓ! క్రూరనృపుఁడా! ఒకబాణముచే మానందనుని రక్తసిక్తునిగఁజేసి, హతమొనర్చితివి. ఒకవాణిచే నిశ్శోణితముగా మాప్రాణములఁ బోనడంప నుంటివి. కట్టా! నీయట్టి కటికవా రుర్వియుందుందురా! పుత్రరత్నమా! ఆరాజసుతకుఁ బలివై యుండినచో బ్రతికి యుందువు కదా?

విశ్వనాథ:—ఓయీ! మమ్ము మాతనయుఁడు పడి యున్నచోటికిఁ గొంపోయి, మానందనసుందర దేహమును జూపుము. అన దశరథుఁడు వారలమెల్లగాఁగావడితో సరయూతీరమునకుఁ దీసికొనివెళ్లి, శ్రావణ శరీరముకడఁ గూర్చుండఁ బెట్టెను. అంత వారా చేతన రహితమగు, కుమారదేహమును చేతులతో నిమురుచు, నిట్లు విలపింపఁ దొడంగిరి.

అన్నపూర్ణ:—తండ్రీ! నీమనోహరరూపసంపదను గన్నులారఁ గాంచుభాగ్యము సర్వేశ్వరుఁ డింతకుమున్నె యంత మొనరించినాఁడు. నీవినయసుందరములగు సుభాషితముల నాలించుభాగ్యము నిపుడీనరేశ్వరుఁడు తుదముట్టించినాఁడు. ఈనాటికి నాపురాకృతకర్మము పూర్తిగా ఫలించినది. ప్రియనందనా! ఇది నీమృతదేహమా? ఇస్సి! నాహృదయము పాషాణమయము కావుననే, పగులకున్నయది.

విశ్వనాథ:—పుత్త్రిరత్నమా! తెల్లవారకమున్నె స్నానసంధ్యాదులఁ దీర్చి, నీవొనర్చు మనోహరపావనసామగానము, ఇఁక నాచెవులకెట్లు విననగును? కుమారా! అంధులగు నీతలిదండ్రులబాధలఁ జూడఁజాలక ప్రాణముల విడిచితివా? లేకున్న మమ్ముఁ బోషింపనేరక యసువుల బాసితివా? ఓరాజా! మాకెంతటిదుఃఖమునుఁ దెచ్చిపెట్టితివి! ఓయీ! నిష్కారణముగా నేపాప మెఱుఁగని మాబిడ్డనుహతమొనర్ప నీకుఁ జేతులెట్లువచ్చె? ఓ! సజ్జనహంతకుఁడా! నృపుఁడా! మావలెనే నీవును పుత్త్రిశోకముచే విలపించుచుఁ బ్రాణములఁ బాయుదువు గాక.

దశర:—ఆర్యా! నే నొనర్చిన ఘోరపాపమున కీశిక్ష చాలదనియే తలంచెదను. మునివరా! ఈదురితాత్ముఁడు చేయవలసిన పనియేదియేని యున్నచో విధింపుఁడు. సాధుసేవచే దురితము పరిహారము కాఁగలదు.

విశ్వనాథ:—భూపాలా! మాచే నీ పవిత్రాత్ముని దేహమునకు దహనసంస్కారము చేయింపుము. ఇదియే నీవు మాకొనర్పఁదగిన యుపకృతి.

దశరథుఁడు వారు కోరినరీతిని స్నానమాడించి, చితి నేర్పఱచి, శ్రావణదేహము దానిపైనుంచి విశ్వనాథునిచే వగ్నిసంస్కారము చేయించెను. విశ్వనాథుఁ డట్లు దహనక్రియ నిర్వర్తించి, తిరుగ స్నానమాడి, నదీజలముల నంజలి నిడుకొని కుమారునుద్దేశించి యిట్లుపలికెను.

విశ్వనాథ:—ఓ పరమపావనజీవనా! శ్రావణా! నీవు భక్తితో మాకొసంగవలసిన నివాపాంజలిని మేము స్వకర్మదుర్విపాకముచే, నీకొసంగవలసి వచ్చినది. కావున, పితృపరిచరణపరాయణా! నందనా! ఈతర్పణోదకములఁ దృప్తిగాఁగ్రోలి, ప్రేతదేహమును విడచి దివ్యదేహముతో అక్షయానందప్రదమగు ముక్తిపదమున కేఁగుము. నీవెంట మేమును రాఁ బ్రయత్నింతుముఁ అని యానీటిని నదీతటమున విడచెను. అంత శ్రావణుఁడు, దివ్యరూపముతో నమర విమానారూఢుఁడై, యాకసమునుండి తలిదండ్రుల నుద్దేశించి, యిట్లుపలికెను.

శ్రావణ:—దయామయులారా! పితృదైవతములారా! మోక్షప్రదమగు మీపాదారవింద పరిచర్యచే దివ్యవిమానారూఢుఁడనై, నేనుత్తమలోకమున కేఁగుచున్నవాఁడను. మీరుకూడ వేగముగాఁ బుణ్యలోకమునకుఁ బోవనున్నారు. విచారింపకుఁడు. ఇంతకుఁ బూర్వదేహముతో నే నాచరించిన యపచారముల క్షమించి, నాకు సెలవొసంగుఁడు. తలిదండ్రు లనుమతించినఁగాని సుతు లుత్తమగతి నందఁ జాలరు. ఇవే వందనములు. విశ్వనాథుఁ డాశ్రవణ సుఖదములగు, శ్రావణ భాషణముల నాలించి, దశరథు నిట్లు ప్రార్థించెను.

విశ్వనాథ:—రాజేంద్రా! పరమపవిత్రుఁడగు మాసుతునిచితిపై మరికొన్ని చితుకుల వేసి ప్రజ్వలింపఁ జేయుము. మేము యోగముచే బ్రాణముల విడచినపిమ్మట మామృతదేహముల, నాచితియందుంచి, దహనమొనర్పుము. అనాథ

ప్రేతసంస్కారము అనంత ఫలప్రదము. అని వెంటనే భార్యాభర్తలు ప్రియోపవేశముచేఁ బ్రాణములఁ బాసిరి.

దశరథుఁడు వారు కోరినరీతిని, వారిదేహముల కగ్నిసంస్కార మొనర్చి, సరయూజలముల స్నానమాచరించి, ఆ వృద్ధుఁడు తనకొసంగిన శాపమునకును, తాఁజేసిన పాపమునకును పరితపింప సాగెను. "నిజమే; పాపభీతులగు భూపతులు ప్రేతరాజపరిపాలనమునకు లోఁబడవెఱతురు.

అట జ్యోతిష్మతీపురమున ఇందిర పద్మనుపిలచి, "చేటీ! నాకంటికి నిదుర వచ్చుటలేదు. ఆమునికుమారుఁడు నాయనురాగదీపమునకు స్వస్నేహపూరమునొసంగి, ప్రకాశింపఁ జేయునో! లేక నిరోధించి యార్పివేయునో! తెలియరాకున్నది. ఇపుడు కలుగుచున్న యపశకునములఁ జూడజూడ మాయిరువుర కీజన్మమునఁగూడిక యొడఁగూడునట్లు తోఁచుటలేదు. భగవానుఁడు నాకన్యాత్వమును గలుషితమునుగాఁ జేయకుండుఁ గావుత.

పద్మా! నీవొకసారి సత్రమునకేఁగి, ఆసుగుణసుధానిధి పితరులయనుమతినిఁ బడసినదియు, లేనిదియుఁ దెలిసికొనిరమ్ము. ఇట్టిసమయముల నీయట్టి సఖులసుముఖతయే సౌఖ్యసాధనము. అన పద్మ సత్రముకడకేఁగి, నలుగడలఁ బరికించి, శ్రావణాదులు కానరామికి వగచి, కావలివారలఁ బ్రశ్నింప, వారు "ఇపుడే

యాచిన్నవాఁడు తలిదండ్రులఁ దోడ్కొని, ఉత్తరదిక్కుగా నేగినాఁడు.” అని తెలిపిరి.

పద్మ యావార్తను విని, పరుగుపరుగున వచ్చి, ఇందిర కాసంగతి నెఱింగించెను. ఆమాటవిన్నతోడనే యారాకుమారి శ్రీకొమరునిపైఁ గూరిమిని వారింపనేరక “హా! హతాస్మి” అని మూర్ఛిల్లెను. పిమ్మట పద్మ శీతలజలములచే మూర్ఛఁ దేర్ప ఆరాజనందన శ్రావణునిఁ గలయఁగోరి,యొకయుత్తరమునఁ దనసంకల్పమును వ్రాసి, తెల్లవారినతోడనే దానిని తనతలిదండ్రుల కందఁజేయుమని, పద్మకందిచ్చి, వెంటనే సేవకునిచే సవారీగుఱ్ఱమును దెప్పించి, దానిపై నెక్కి, కుబేరదిశాభిముఖియై, కోసలారణ్యమునఁ బడి, అరుణోదయ మగుసరికి సరయూతటమునకు వచ్చిచేరెను.

అట దశరథుఁడు తానొనర్చిన మునికుమారవధను దలంచి,“హా రా! ఎంతటి ధీమంతులకును కర్మరహస్యముల నెఱుంగఁ సాధ్యముకాదుకదా! శత్రుసంహారానుకూలమగు శస్త్రప్రయోగము నభ్యసింప వచ్చిన నాకీపుత్త్రవియోగశాపప్రాప్తియా? నేను పెండ్లియాడక, బ్రహ్మచారినిగా నున్నచో నన్నిశాపమేమి చేయఁగలదు? అయ్యో! నావెఱ్ఱి, పాపఫల మవశ్యంభోక్తవ్యమగుటచే నేనిపుడు పరిణయపరాఙ్ముఖుఁడనైయున్నను కర్మఫల మాసన్న మగునపుడు, పాణిగ్రహణాభిలాషినై తీరుదును; అని పలుకుచుండ శ్రావణావృత్తాంతమును దెలియఁ గాంక్షించుచున్న ఇందిర దశరథుని సమీపించి యిట్లుప్రశ్నించెను.

ఇందిర:—ఆర్యా! మీరలెవ్వరు? ఓ యన్నా! ఈ దారిని వృద్ధులగు పితరులఁ గావడియం దిడుకొని, యెవ్వఁడేని యువకుఁడిటు వచ్చెనా?

దశరథ:—అమ్మా! నాతో మాటలాడకుము. నే నొక మహాపాతకిని. క్రూరకిరాతుఁడను. అసంభాష్యుఁడను. అపరాధిని.

ఇందిర:—సోదరా! నీ వింత దురంతచింత నొందుచుం డుటకుఁ గారణమేమి? నీవార లెవరైన గతించియుండిరా?

దశరథ:—కారణమా! ముగ్గురు సాధువుల నొక్కకోలతో హత మొనర్చితిని. తల్లీ! నీవడిగినవారు నీకేమి కావలయు?

ఇందిర:—అన్నా! దైవకృపయున్నచో అత్తమామలును, భర్తయుఁ గావలయు. ఆర్యా! వారినేనా మీకోలఁగూల్చేసినది?

దశరథ:—సాధ్వీమణీ! సందేహమేమి? ఆతాపసదంపతులను సుతసహితముగఁ గడతేర్పఁ గలిగితిని. కాని, నేను మాత్రము చావనేరకుంటిని. ఇంకను ముం దెందఱు సజ్జనులు నాచే వధింపఁ బడవలసియున్నారో తెలియదు. పిడుగువంటి యీనుడువు విన్నతోడనే "హా సౌమ్యసుందరాకారా! తాపసకుమారా!" అని, ఆరాకొమరి మూర్ఛిల్లి నేలఁబడెను. అంతట దశరథుఁడు సరయూనీరముల నామెపైఁజల్లి మూర్ఛదేర్చి ఇట్లు పలికెను.

ఇందిర:—కటకటా! ఎంతటి పాపాత్మురాలను! నే నీమునినందనునిఁ బ్రేమింపకున్న, ఈసజ్జనున కిట్టి ఘోరమరణము సంభవించెడిది కాదు. ఓ పశ్చాత్తప్తుఁడా! సోదరుఁడా! నిజముగా నీముప్వురఁ జంపినది నా వేడికోలు కాని నీ వాడికోల కాదు. ఆర్యా! వారిపావన మృతదేహము లెక్కడ?

దశరథ:—అమ్మా! వారిదేహములలో సుతునిశరీరము నకుఁ బితయే చితాసంస్కార మొనర్చినాఁడు. ప్రాయోపవేశముచే నాతనిపితరులు ప్రాణముల విడచినపిమ్మట వారిదేహములఁ బుత్త్రిని చితిపైనుంచి, యీపాపాత్ముఁడు దహనసంస్కారము చేసినాఁడు. పాపముల మూటఁగట్టికొని, యిటపాషాణమువలెఁ బడియున్నాఁడు. సోదరీ! ఆముని త్రయమువెంట నేను గూడ నేఁగియుండినచో నీ కీదుర్వార్తను దెలుపకుందును కదా! ఓ జముఁడా! నీ వీట నాకుఁజోటు లేదా? ఓ విధాతా! నా నుదుట చావు లేదని వ్రాసితివా?

ఇందిర:—ఆర్యా! కర్మగతు లతిక్రమింప నెవ్వరికి శక్యము కాదు. నీబాణము నిమిత్తమాత్రము. వారిని మృత్యుముఖమునఁ బడవేసినది వారికర్మమే. జీవులఁ బుట్టించువారు కాని, గిట్టించువారు కాని, మానవులు కారు. వారి వారి పూర్వభవ కర్మములే జనన మరణములకు నిమిత్తములు. సోదరా! పశ్చాత్తాపము పాపహరము. అని వెంటనే సరయూ జలముల స్నానమాచరించి, ఆయిందిర ముందర మండుచున్న చితికడ కేఁగి

యందుఁ గొన్ని యింధనములవేసి, యాచితికి ముమ్మారు ప్రద క్షిణ మొనర్చి, యిట్లు పలికెను.

ఓసుమశరసుందరరూపా! నిష్పాపా! నాపాపంపు ప్రణయము నీమరణమునకుఁ గారణ మాయెనా? ఓగిరిజా మోహనా! త్రినయనా! ఈపుణ్యాత్మునకుఁ దిరుగఁ బుట్టుక యున్నచో, నేను పునర్జీవిత నగుచో, భావిభవమునన్నైన నా కీసుచరితుఁడే జీవితేశ్వరుఁ డగున ట్లనుగ్రహింపుము. అట్లు కాక, యీసజ్జనాగ్రగణ్యుఁడు జననరహితుఁ డగునెడ నన్ను రాగభూషితయగు యోషనుగాఁ బుట్టింపక, విరాగిణియగు బ్రహ్మచారిణిఁగా సృష్టింపుము. లేదా! జ్ఞానకలితయగునాతినిగా జనింపసేయక, చేతనారహితమగు ఆతినిగా సృజింపుము. అని యంజలినిండ జలములఁ జేకొని—

"ఓపరలోకగామీ! స్వామీ! ఈయిందిర హృదయ పూర్వకముగా సమర్పించుచున్న యీప్రణయజలాంజలిని, పాథేయమునుగా స్వీకరించి, నీపరలోక ప్రయాణమును సాగిం పుము. నాదోషములకుఁ గోపింపకుము. సదాశయా! యమ కింకరులు నన్నడ్డగింపకున్న, నీసన్నిధికే వత్తును." అని దోసిలి లోని నీటి నేటిగట్టున వదలి, మండుచున్న చితిలోఁబడి, ఆసతి పతిసాలోక్యమును పొందెను.

దశరథుఁ డాసాధ్వీసాహసకృత్యమున కబ్బురమంది "ఆహా! ఇప్పటికి నలుగురి చావునకుఁ గారణమైతిని. కడలుల

వలె కడలేని నాలుగు కీడుమడుగుల నిర్మించితిని. ఇంక నీ పాపపుకొలంకుల నింకింపఁ జేయుటెటులు ?

"ఆహా ! ఏమి ! యీయువతీమణి ప్రేమగరిమ ! ఒక పేదవానిని ప్రేమించి, యావలపుకాఁడు కర్మవశమునఁ గాలమున లీనముకాగా, ఆప్రియునెడబాసి యుండఁజాలక యాతనిఁ జేరఁగోరి, చితినిఁబడి, పతికడ కేఁగెను! సతులయనురాగ తంతువులు తెంప శక్యములు కావుకదా ! అవివాహితయగు యువతియే కాంక్షితపతి నెడఁబాయనేరనపుడు, పతిసుఖసంగతలగు కాంతలమాట చెప్పనేల !

"కష్టా ! నే నెంతటి ఘాతుకకార్య మొనర్చితిని ! ఏదియో జన్మాంతరకర్మము నన్నీదురిత కృత్యమునకుఁ బ్రేరేపించి యుండనోపు. కాదుకాదు. నేఁజేతులార బాణమును వదలి, యామునికుమారునిఁ జంపి, యీపాపమును పూర్వజన్మకర్మముపై మోపుట పాడికాదు. నే నిఁక రవికులనృపాలపాలన పూతమగు సాకేతమున నడుగిడ నర్హుఁడను కాను. కావున నేఁగూడ నీమండుచున్న చితి కాహుతినై, పరలోకమున కేఁగి ఆపావనచరితుల సందర్శింతును.

"అయ్యయ్యో ! నే నెంతటి యవివేకిని ! ఆపుణ్యాత్మ లేఁగినలోకములు పాపాత్మునకెట్లు లభ్యములగును! ఇఁక నాకు స్వాగత మొసంగువారు యమపురవారులే. కా దిట్లు భీతిల్లరాదు. దైవకృపచే నాకుఁగూడ నిట్టి సుశీలుఁడగు బాలుఁ

ముదయింపరాదా! ఆసుచరితునిమూలమున నే నుత్తమలోకముల కేఁగరాదా! పురుషసంపద లెట్లు తారుమారగునో పరికింపుఁడుదురు? ఔరా! ఎంతటి పేరాస! ఇపుడేకదా! ఆమునిచే, "పుత్త్రశోకముచేఁ జత్తువుగాక" అని శపింపఁబడితిని. కావున, నాకుఁ బుత్రునివలన నుత్తమగతు లెట్లు కలుగ నేర్చును? కామకాదు. శ్రీహరికృప యున్న నన్నియు సమకూరును." అనియిట్లు తన స్థితిగతులఁ గూర్చి తల్లడిల్లుచుండెను.

---

# దశమాశ్వాసము.

## పూర్వజన్మము.

అంత నంబరవీధినుండి దురితహరమగు శ్రీహరిసంకీర్తనము వినవచ్చెను. దశరథుఁడా శ్రుతిసుఖదమగు నాదము నాలించి, తల పైకెత్తి చూడ మింటనుండి సురమునివరుఁడగు, నారదుఁడు నారాయణగుణముల వీణాగుణములచేఁ బలికించుచుఁ గ్రింది కవతరించుచుండుటను గాంచి, సంతుష్టాంతరంగుఁడాయెను.

నారదుఁడు తిన్నగా దశరథుఁడున్న తావునకు రా, ఆకోసలాధిపుఁడు నారదునకు వందనమొనర్చి, యిట్లు ప్రార్థించెను. "మునివరా! సదా పతితపావనుఁడగు వనమాలినామముల సంకీర్తన మొనర్చుచు, జీవకోటిని సదోపదేశనలచే నుద్ధరించుచు, ముల్లోకముల సంచరించు మిమ్ము దర్శించుటచే పాపానలకీలాతప్తమగుచున్న నాహృదయ మూరట నందినది.

"చతుర్ముఖనందనా! నావందనములఁ జేకొని, యీ యజనందనునిఁ గలుషరహితునిగాఁ జేయ వేఁడుచున్నాను." అని, యట జరిగినవృత్తాంతము నంతను వివరించి, విచారింపఁ దొడఁగెను. నారదుఁ డాసాకేతపురాధిపుని పరితాపోక్తుల నాలించి, యిట్లు సంబోధించెను.

నారద:—దినకరకులతిలకా! కోసలపాలకా! విచారింపకుము. నీ వెంతమాత్రము పాపాత్ముఁడవు కావు. ఈగత జీవులెల్లరు వా రొనర్చిన పూర్వభవకర్మఫలానుసారము మృతులైరి. నీబాణ మిందుకు నిమిత్తమాత్రముకాని, ప్రధానకారణము కాదు. యముఁడు ప్రాణుల నేదియోసాకుఁ గల్పించి, హత మొనర్చుచుండును. లోకు లీరహస్య మెఱుంగక మృతికిఁ గారణములఁ గల్పించుచుందురు.

ఈశ్రావణుఁడు వైశ్రవణనందనుఁడు. వెనుకటి పుట్టువున నీతఁ డొనర్చిన తప్పునకుఁ దండ్రిచే శపింపఁబడి యీజన్మమున వైశ్యకుమారుఁడుగా నుద్భవించి, భూతలమున నింతవఱకు సంచరించి, యిపుడు శాపాంతమగుటచేఁ బాపము క్షమగు నీశరముచే మరణించి, పాపముక్తుఁడై నిజానురాగిణితోఁ జైత్రరథోద్యానమున సంతోషముగా విహరించుచున్నాఁడు. కావున, నీబాణపాతముచే మర్త్యత్వమునుండి తొలంగి, యమరత్వము నంది యానందించుచున్న వానిఁగూర్చి నీ విట్లు చింతింప నేల ?

దశరథ:—సర్వజ్ఞా! మృతులైన యీయువతీయువకుల పూర్వజన్మగాథను వివరించి, నాపరితాపము నుపశమింపఁ జేయఁగోరుచున్నాను.

నారద:—నృపవరేణ్యా! విను మా సంగతుల చరితములు. పూర్వ మొకప్పుడు కుబేరనందనుఁడగు నలకూబరుఁడు

విశ్వాతిశయసుందరాంగియగు నూర్వశితో, అలకాపురో ద్యానవాటికను విహరించుచుండ, ఆయచ్చరలేమ అసమా నామోదములచే హృదయము నాకర్షించు తెల్లనిపూలగుత్తు లతో నిండి కన్నులకింపు గొలుపుచు మణిమయవేదికామధ్య మునఁ జూపట్టుచున్న నందివర్ధనతరువును గాంచి, నలకూబరు నితో నిట్లుపలికెను.

ఊర్వశి:—హృదయేశ్వరా! నామానసము నీనందివ ర్ధనసుమమంజరులు చూఁడఁ గొనుచున్నయవి నా కీసితసుమ దామమును మెడను దాల్పఁ గుతూహల మగుచున్నది. అన త్తత్క్షణ మాయక్షరాజకుమారుఁడుమణిమయకుట్టిమముపైకేఁగి, పుష్పస్తబకములఁ గోయఁ బ్రయత్నించుచుండ వనపాలుఁడు పరిగిడి వచ్చి, "కుమారా! కుమారా! వలదు. వలదు.పూల గుత్తులఁ గోయవలదు." అని హెచ్చరించెను.

కాని, నలకూబరుఁడు యౌవనమదమునను, ప్రభుతా గర్వమునను, కాంతావ్యామోహమునను, తోఁటమాలి మాటలఁ బాటింపక, నందివర్ధనకుసుమములఁ గోసి, మాలగా సమకూర్చి, ఊర్వశికంఠమున వేసి, తన్ను నిరోధించిన మాల కరిని గాంచి, యిట్లుపలికెను.

నలకూబర:—ఓరీ! తోఁటమాలీ! నీతిమాలి, యక్ష యువరాజునగు నన్ను, సామాన్యునిగాఁ దలంచి, పుష్పములఁ ద్రుంపవలదంటివిగా! ఎంత మత్తెక్కియుంటివి! నీవొనర్చి

యీ యపరాధమునకు భూమిపైఁ గిరాతుఁడవుగాఁ బుట్టుదువు గాక! అని శాపమొసంగెను. అంత నా కిన్నరుఁడు భీతిల్లి, యిట్లు ప్రార్థించెను.

కిన్నరుఁడు:—కుబేరనందనా! యక్షసార్వభౌముఁడగు మీజనకునియాజ్ఞచేఁ గుసుమాపచయ మొనర్పవలదని, తెలిపితి నేకాని, కంఠకావరముచే మిమ్ము నిషేధించి యుండ లేను. ఈనాఁడు శివరాత్రియగుటచే రాజరాజు పార్వతీపతిని నందివర్ధనకుసుమములతోఁ బూజింపఁగోరి, నన్నుఁబిలచి, "ఓరీ! ఈనందివర్ధనసుమముల నేరిని ముట్టనీయకుము. వీనితోఁ జాగ్ర మాళి నారాధింపఁ దలంచితిని." అని యాజ్ఞాపించెను.

అందుచే నే నాయేలికశాసనానుసారము మిము గుసుమములఁ గోయ నివారించితిని. ధనదనందనా! యిందు నాదోసమేమి? నా కెంతటి దారుణశాప మొసంగితిరి! రాజరాజకుమారులకిట్టి వేగిరపాటు తగునా? కావున శాంతాత్ములరై శాపమును నివారించి, నను గాపాడుఁడు. అన నలకూబరుఁడు తా నొనర్చిన యనాలోచితకార్యమునకుఁ బశ్చాత్తప్తుఁడై యిట్లు పలికెను.

నలకూబరః:—ఓయీ! రాజభక్తుఁడా! నావేగిరపాటు నకు వగచుచుంటిని. కామాంధుఁడనై యీనాఁడు కామారి యగు శంకరునిఁ బూజింపవలసిన శివరాత్రియను మాటను మఱచుటయేకాక, శివసఖుఁడగు నాజనకుని శాసనమునుకూడ

నలసు చేసితిని. నాక్షేమమును గోరి, హిత ముపదేశించుచున్న నిన్నుఁ గ్రోధావేశముచే శపించితిని. ఓతోఁటకాపరీ! నేనొసఁగిన శాపము నీ వనుభవింపక తప్పదు. నీవు మానవలోకమునఁ గిరాతజాతియందుఁ బుట్టి, కొంతకాలమునకు వాల్మీకిశాపముచే హతుఁడవై, తిరుగ యక్షరూపమునుఁ బొందఁగలవు. అని శాపాంతమునుఁ దెలుపుచుండఁ గుబేరుఁడు పరమేశ్వరారాధనమునకు నందివర్ధనసుమములఁ గోయ నటకు వచ్చుచుండెను.

అపు డూర్వశి ఆజక్కులయొడయుని రాకనుగాంచి, భీతయై మెడలో నిపూలదండ నొడిలో దాచి, యొకచెట్టు చాటున దాగెను. నలకూబరుఁడు తండ్రినిఁ గాంచి, తలవంచి నిలచెను. అంత నిందుశేఖరసఖుఁడు నందివర్ధనపాదపము సమీపించి, పాలుకారుచున్న పూలతొడిమెలఁ గాంచి, కుపితుఁడై యట నిలచియున్న వనపాలునిఁ జూచి, యిట్లు పలికెను.

కుబేరుఁడు:—ఓరీ! తోఁటమాలీ! నాయాజ్ఞ నుల్లంఘించి, యీచెట్టుపువ్వుల ద్రుంచిన తులువలెవ్వరు? నీవు వారినేల నివారింపలేదు? అన భటుఁడు భయకంపితుఁడై, నలకూబరునిఁ జూపి, జరిగిన వృత్తాంతమును నివేదించెను. ఆసంగతి నాలించి, కుబేరుఁ డుగ్రుఁడై, తనయునివైపు తిరిగి యిట్లు పలికెను.

కుబేర:—నలకూబరా! రాగాంధుఁడవై, రాజశాసనమును సరకుసేయక, హరపూజార్హములగు నందివర్ధనప్రసూ

నములఁ గోసి, యొక యచ్చర కిచ్చితివి. ఇందుచే నీవు పితృద్రోహివియు, మహాపరాధివియు నైతివి. కావున నీ వొనర్చిన యీతప్పిదమునకు భూమిపై నరుఁడవుగాఁ బుట్టుదువు గాక! నిన్ను బువ్వులఁగోయఁ బ్రేరేపించిన కామినియు, నీతోపాటు మేదినిమీఁద జనించుఁగావుత. అని శపించెను.

అంత నాచెంతనున్న యూర్వశియు, నట నిలచియున్న నలకూబరుఁడును, ఆ యలకాపురీశునిపాదములపైఁ బడి, అజ్ఞానముచేఁ దాముజేసిన యపరాధముల క్షమియించి, శాపమును నివారింపుఁడని వేడికొన, నాయక్షేశ్వరుఁడు, "మీరు భూమిపైఁ బుట్టితీరుదురు. పెద్దల యానలఁ బాటింపమికి ఫల మనుభవింపవలసినదే, కాని పశ్చాత్తప్తులరై వేడుటచే మీపాప మొకింత శాంతించినది. అందుచే మీశాపములను గడువేర్పఱతును. వినుఁడు. "నలకూబరా! నీవు మానవలోకమున ధార్మికులగు వైశ్యదంపతులకుఁ బుత్త్రుఁడవై జనించి, బ్రహ్మచర్యవ్రతసంపన్నుఁడవై పితృసేవచేఁ గాలమును గడుపుచుఁ దుదిని కోసల నృపాలునికోలచేఁ గూలి, ముక్తిఁ గందువు. ఈయచ్చరలేమయు నిలాతలమున నృపాలబాలికగా జనించి, నిన్ను వినా యన్యుని వరింపక, నీయందలి యనురాగముచేఁ బ్రాణముల విడచి, తిరుగ నిన్నుఁ గలసికొనఁగలదు." అని తెలిపి వెడలి పోయెను.

దశరథరాజేంద్రా! ఆరాజరాజశాపముచే, ఊర్వశీ నలకూబరులు, ఇందిరాశ్రావణ నామములతో ధరాతలమున నుదయించి, శాపాంతము వఱకిట సంచరించి, యీనాఁడు శాపావసానదివస మగుటచే మానవశరీరములఁ బాసి, దివ్యదేహములతో నలకాపురిని సుఖముగాఁ విహరించుచున్నారు. కావున ఆయువతీయువకుల మృతికై, నీవు విచారింప నవసరము లేదు. ఈశ్రావణుని తలిదండ్రులును, క్షామకాలమున నమేయజనసమూహముల కన్న మొసంగి, కాపాడుటచే, శివలోకమున నిత్యానంద మనుభవించుచున్నారు. అందుచే వారిమరణములకును కుందనగత్యము లేదు.

దశరథ:—మునిచంద్రా! ఈకుబేరకుమారుఁ డొనరించిన యొకతప్పున కెంతటి ముప్పు వాటిల్లినది! దేవతులకే పాపఫల మనుభవింపక తప్పనప్పుడు, మానవుల మాట చెప్పనేల! నిజమే! నిప్పును పెద్దలు ముట్టుకొనినను, చిన్నలు తాకినను, కాల్చియే తీరును. ఆతీరుననే పాపమును, సురనరభేదమును బాటింపక బాధించియే తీరును.

నారద:—రాజేంద్రా! ఈకొబేరియొనర్చినది యొక్క తప్పు కాదు. అనేకాపరాధములఁ జేసెను. కనుము. కులకాంతనాదరింపక, కులటను ప్రేమించుట మొదటితప్పు. తండ్రిమాటను బాటింపక, పూలఁద్రుంచుట రెండవదోషము. ఉపవసింపఁ దగిన శివరాత్రి నుపభోగింపఁగోరుట, మూడవతప్పిదము.

హితముఁ దెలుపుచున్న సేవకునిఁ ద్వరపడి శపియించుట, నాల్గవ యపరాధము. చంద్రమౌళి జటాజూటమున సమర్పింపనర్హము లగు ప్రసూనముల జారిణీగళమున నలంకరించుట, యైదవనేరి తము. ఇట్లీనలకూబరుఁడు పాపపంచకము చే వంచితుఁడాయెను. పరికింప వీనియం దొక్కటియే చాలును స్త్రీపురుషుల నధో గతి పాల్సేయుటకు.

దశర:—సంయమీంద్రా! ఈవృద్ధదంపతుల యితివృ త్తమును గూడ వినిపింప వలయును. ఇట్టి యుపాఖ్యానముల వినుటచే జనులు తమజీవితముల దిద్దికొన సమర్థులగుదురు. జ్ఞానోదయమునకు సనాతనచరితములే సాధనములు.

నారద:—నృపాలతిలకా! వినుము ఈయన్నపూర్ణా విశ్వనాథుల కథను. విశ్వనాథుఁడు పూర్వజన్మమునఁ గాశీప ట్టణనివాసియగు వైశ్యశ్రేష్ఠుఁడు. ధర్మరతుఁడు. చంద్రశేఖ రాభిధానుఁడు. శివపూజాధురంధరుఁడు. సచ్చారిత్రుఁడు. అన్న పూర్ణ, వారణాసిని అన్నపూర్ణాలయమునఁబనిసేయు దేవదాసి. మధురవాణినామధేయ పార్వతీపదధ్యానాసక్త. వృత్తిని దాసి యైనను చిత్తమున సువృత్త.

చంద్రశేఖరుఁడు అన్నపూర్ణాలయమునకు వలయు సంభారముల సమకూర్చు బండారిగా నుండుటచే ఆదేవాలయ మునఁ బనికత్తెయగు మధురవాణి పూజాద్రవ్యములకై తఱచు చంద్రశేఖరునిమందిరమున కేఁగుచుండెడిది. అందుచే నాబేరి

కడఁ జనువును, ఆబేహారిపై మక్కువయును గలిగియుండెడిది. కాని ఆవైశ్యశ్రేష్ఠునకు మధురవాణి తనపై వలపుగొని యున్న సంగతి తెలియదు.

ఆకాలమునఁ గాశీపురాధీశ్వరుఁడగు చంద్రకేతునకు సంతతి లేకుండుటచే నందుకై జపతపాదులఁ జేయించుచుండెను. ఇటులుండ యోగిపుంగవుఁ డొకఁడు, రాజమందిరమునకు భిక్షార్థియై రా, రా జాదివ్యతేజోమయుఁడగు మునివరునకెదురేఁగి, సాదరభావముతోఁ బూజించి, యిట్లు ప్రార్థించెను.

చంద్రకేతుఁడు:—యతిచంద్రా! నేను సంతతిలేక పరితపించుచున్నాఁడను. నాయం దనుగ్రహ ముంచి, నాకు సుగుణకలితుఁడగు సుతుఁ డుదయించునట్లు కటాక్షింపవలయును.

యతి:—రాజేంద్రా! నీమనోరథ మీడేరుటకర్హమగు పుణ్యవ్రతము నుపదేశింతును. వినుము. ఈకార్తిక శుద్ధైకాదశీ సోమవారమున పత్నీసహితుఁడవై, ప్రదోషసమయమున నన్నపూర్ణాలయమున కేఁగి, కోటి సువర్ణపద్మములతోఁ బార్వతికిఁ బూజయొనర్పుము. అందుచే నీ కచిరకాలములో సుగుణసుందరుఁడగు నందనుఁ డుదయింపఁగలఁడు. పుణ్యము లేక మనోరథార్థములు సిద్ధింపవు. అని బోధించి, వెడలిపోయెను.

అంత నాతేఁడు యతి తెలిపినరీతిని సువర్ణ రాజీవము లతో గౌరి నారాధించి, వ్రతాంతమున తన మందిరమున కేఁగెను. ఆరాత్రి యట వంతు మేఱకు సేవచేయవచ్చిన మధుర వాణి సహస్రదీపములనడుమ పచ్చని తంగేడుపూవులవలె ముచ్చటగాఁ బ్రకాశించుచున్న కాంచనకంజములఁ గాంచి, దుఃఖ మాసన్నమగుటచే మానసము చలింప, ఆబంగారు తా మరవిరుల నపహరింపఁ దలంచి, పూజారి లేనిసమయము జూచి, యాపసిడియలరులఁ గొన్నిఁటినిఁ దీసి, యొడిలోదాచి, యేమియు నెఱుంగనిదానివలె నటించుచు రెండవదాసి రా వెంటనే గుడినుండి వెలువడి, తా దొంగిలించిన పసిడిపువ్వులఁ జంద్రశేఖరునిమందిరమునకు గొంపోయి, అమ్మఁజూపెను.

ఆబేరి దురితకూపమునఁ బడవలసి యుండుటచే, ఆకాం చనవారిజములఁ గాంచినతోడనే, యాశగొని, చవుక బేరము నకు వానింగొని, మధురవాణికిఁ గొంచెము ధనమొసంగి పంపి వేసెను.

"ఆహా! కాంతాకనకము లెంతవారినిఁ గూడ నీతి కుడ్యముల దాటించును కదా! లేకున్న సుచరితుఁడగు నీవై శ్యవరుఁడు దేవాలయమునుండి దొంగిలించి తెచ్చిన పుత్తడి తామరల విత్తమిచ్చి కొనుట యెట్లుపొసగును?

ఆమఱునాఁ డుదయమున ఆలయాధికారులు కనకపంక జముల లెక్కించి చూడ అందుఁ గొన్ని కానరానందున గతరా

త్రి ఆలయమున నున్నవారి నందఱిని బాధించి, కొలువుకూట మునకుఁ గొంపోయి, వారిని రేనియెదుట నిలువఁబెట్టి, తపనీయారవిందములు అపహరింపఁబడిన సంగతి నెఱింగించిరి. అపుడు కాశీపురాధీశుఁడు ఆయభియోగులను విని యాయపరాధుల నిట్లు ప్రశ్నించెను.

చంద్రకేతుఁడు:-ఓదోషులారా! మీరు నిజము నివేదించి నచో దండింపను. అన్యథా మీకఠినశిక్షను విధింతును. అన మధురవాణితక్క మిగిలినవారందఱు "ప్రభువరా! మా కాబంగారు తామరపూవులఁగూర్చి యేమియుఁ దెలియదు. ఏలినవారి పాదము లాన. ఇంతకంటె మేము విన్నవించుకొనవలసిన దేదియును లేదు." అన రాజు మధురవాణిం జూచి, యిట్లుపలికెను.

చంద్రకే:—ఓసీ! మధురవాణీ! నీ వేలమాటలాడకుంటివి? నీజాడఁ జూడఁబసిఁడి తమ్ముల దొంగిలించినదిమ్మరివి నీవేయని, వెల్లడియగుచున్నది. సత్యముదు దెలుపుము. లేకున్నఁ దలఁ దీయింతును.

మధురవాణి:—నృపసార్వభౌమా! సత్యమునే విన్నవించుకొందును. మున్నెన్నఁడు నే నట్టి పాపకృత్యమును జేసియెఱుంగను. కాని నిన్నసాయంకాలమున ఏలినవారు పూజచేసిన పసిఁడితామరలఁ జూచినతోడనే, నాహృదయాంతరమునుండి యేదియో తెలియరాని శక్తియొకటి నన్నుఁ గుసుమాపహరణమునకుఁ బ్రేరేపించినది. అది నాదుష్టబుద్ధియో? లేక నా

ప్రారబ్ధవిధియో ? తెలియ రాకున్నది. దానిప్రేరణముచే నేను కుసుమముల నపహరించి, వానిని చంద్రశేఖరుఁడను వైశ్యునకు విక్రయింపఁ జూపితిని. నాకువలెనే, యాతనికిఁగూడ నపకీర్తి రానుండుటచేఁ గొలఁదివెల కాపువ్వుల నాబేరి చేకొనెను. కావున నా దోసమునకుఁ దగిన దండనము విధింపఁగోరుచున్న దానను.

చంద్రకేతుఁ డామధురవాణి పశ్చాత్తప్తయై నిజమునివేదించినందుకు సంతసించి, దానిని పొమ్మని, పువ్వులను గుత్తకు దీసికొన్న వర్తకుని రాఁబిలిపించి, ప్రశ్నింప, ఆతఁడు తా నొనర్చిన ముష్టవస్తుక్రయము నొప్పుకొని, యిట్లు ప్రార్థించెను.

చంద్రశేఖరుఁడు:— రాజేంద్రా ! కర్మప్రాభవముచే బుద్ధి కాలుష్యమునంద లోకనిందకు వెఱువక, యీమధురవాణి తెచ్చిన పసిడివిరుల గొలఁదివెలకుఁ గొంటిని. కాని, యీ దేవదాసి నాయింటినిబాసి పోయినతోడనే నాయంతరాత్మ నే నొనర్చిన తప్పిదమునకు నన్ను బాధింపఁదొడఁగినది. ప్రభువరా! ఇవిగో సువర్ణనీరజములు. వీనిని, వీనితోఁబాటు నాపూర్వార్జిత సంపదలను, జేకొని ధర్మకార్యములకై వినియోగింపఁ బ్రార్థించు చున్నవాఁడను.

చంద్రకేతు:—మిత్రుఁడా! నేను నీ శీలము నెఱుంగని వాఁడను కాను. నీయట్టి పశ్చాత్తప్తులకు రాజదండనముతో నిమిత్తము లేదు. కావున విచారింపక సుఖముగా నుండుము.

చంద్రశేఖర:—దయానిధీ! సిరితొలఁగిన జీవింపవచ్చునుఁగాని, కీర్తి మాసిననాడు బ్రతికియుంట పాడికాదు. యశోహీనుఁడు క్షితిపై సంచరించుటకంటె, చితిపై నెక్కుట దొడ్డపని. అని నివేదించుచున్నను రాజు ఆవైశ్యునిసంపదను జేకొనక విడచి పెట్టెను.

కాని, మధురవాణియు, చంద్రశేఖరుఁడును, తామొనర్చిన దురితకృత్యములకు లోఁగుందుచు, బంధుమిత్రాదులమధ్యనుండఁజాలక, అర్ధరాత్రమున గంగాప్రవాహమునఁ బడి, మరణించిరి. దశరథరాజేంద్రా! వారే యీభవమున అన్నపూర్ణావిశ్వనాథులను పేర ప్రసిద్ధిగాంచిరి. మునుపటి జన్మమున వారొనర్చిన, దేవధనాపహరణపాపమువలన ఈజన్మమున ముదిమిని దరిద్రులును, అంధులునునై పుత్త్రశోకముచేఁ బ్రాణముల విడువవలసిన వారైరి.

దశరథ:—సంయమివరా! చిరకాలము సత్ప్రవర్తనము కలవారలై ప్రమాదవశముచే నొక్కసారి వారుచేసిన దోసమునకే యింతటి దుర్భర దుఃఖము లననుభవింప వలసినవారైరే! ఇక ప్రతినిత్యము బుద్ధిపూర్వకముగాఁ బాపకార్యముల నాచరించువారి, జీవితము లెంతదుఃఖ భూయిష్ఠములు కాఁగలవో కదా?

నారదుఁడు:—కోసలేంద్రా! దురితకృత్యముల ఫలము ప్రాణుల నంటియుండును కాని, దూరముగాఁ దొలఁగియుండ నేర

దు. పరమేశ్వరునకుఁ గూడ వీనిఁ దొలిగింప సాధ్యముకాదు. కామక్రోధాదులచే జనులు ముందురానున్న దుఃఖములఁ దెలియఁ జాలక, పాపకార్యముల స్వేచ్ఛగాఁ జేయుదురు. వాని ఫల మనుభవించునపుడు పశ్చాత్తాపము కలవా రగుదురు. ఇదియే ప్రకృతివైచిత్ర్యము.

దశర:—మునివరేణ్యా ! నాకేదియేని ముక్తిప్రదమగు మంత్రము నుపదేశించి, నాజీవితముఁ గీర్తివంతమగున ట్లొనర్ప వలయును. అన నారదుఁడు దశరథున కష్టాక్షరిమంత్రము నుపదేశించి, యిట్లు పలికెను.

నారదు—రాజేంద్రా ! నీ వీ మంత్రప్రభావముచే నచిరకాలములో శ్రియఃపతిని సందర్శింపఁగల భాగ్యశాలివగుదువు. అని బోధించి వెడలిపోయెను. దశరథుఁడును నారదునిబోధల కలరి, పరమేశ్వరుని ధ్యానించుచు నయోధ్యకేఁగెనుపోయెను.

ఆహా ! ఏమి! యీపావనశ్రావణోపాఖ్యాన మహిమము! భారతీయ యువజనహృదయనీరజముల వికసింపఁజేసి, సుగుణసౌరభసంపన్నములనుగాఁ జేయుట కీవైశ్యకుమారవీరజీవితభాస్కరకాంతి యొక్కటి చాలదా ? ఈవణిజ్నందనుఁడు పితృసేవకై యెంతటిత్యాగమొనర్చెనో కనుఁడు. కాంతాకనకములకై యువ్విళ్ళూరవలసిన పిన్నవయసున జితేంద్రియుఁడై వనితావిత్తములఁ దృణలవములవలెఁ బరిత్యజించి వన్నెగాంచెను కదా !

సదాశయులగు సోదరీసోదరులు ఇట్టి పావనోపాఖ్యాన ములఁబఠించి, తమజీవితముల విబుధగేయము లగునటులఁ జే సికొందురు గాక !

శ్లో॥ ఉపనయతు మంగళంనః సకలజగన్మంగళాలయ శ్రీమాన్
దినకర కరనిబోధిత నవనళినదళేక్షణో రామః

ఓంతత్సత్,

సంపూర్ణము.